

TRIPURANA VENKATA SURYA PRASADA RAO.

శ్రీరామనవమీ ద్వితీయ పూజాపుష్పము.

శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః.

# రఘూదయము.

ఇది

దంతెవాండా ప్రొప్రయిటరును

నిర్వచన-కుమారసంభవ, రఘువంశ, కిరాతార్జునీయోత్తరరామచరిత్ర

నాటకాది గ్రంథకర్తయును

అగు

మహారాజశ్రీ

శ్రీత్రిపురాన - వేంకటసూర్యప్రసాదరాయకవిగారిచే

విరచింపఁబడి,

---

బ్రహ్మశ్రీ

పండిత, పురాణం - సూర్యనారాయణతీర్థులవారిచేఁ

బరిష్కృతమై

చెన్నపురి;

ఆనందముద్రణాలయమున

ముద్రింపించి

గ్రంథకర్తచేఁ

బ్రకటింపఁబడినది.

1924



Price 8 As.] [దీనివెల 8 అణాలు

## ఏతద్గ్రంథరచనకామోదంబు దెలిపి తోడ్పడినవారలు:—

---

### రాజపోషకులు.

రావు సాహెబ్ ప్రైశింగు వెంకట రంగయ్యగారు యం. యల్. సి. బందరు

### ప్రధానపోషకులు.

లంకె జయరామయ్యగారు, సర్టిఫైడ్ కెప్టెన్, గిలకలదిండి బందరు

వాటిపల్లి వెంకటసుబ్బయ్యగారు ... ... ...

### పోషకులు.

| | | |
|---|---|---|
| సమ్మెట కృష్ణమూర్తిగారు | రంగూన్ వర్తకులు | బందరు |
| మడె బలరామయ్యగారు | వర్తకులు | బాడువ |
| బుడపనేటి కామరాజుగారు | | ఏలూరు |
| లంకె వెంకటస్వామిగారు | | అర్జప్రాజీ |

### అభిమానులు.

| | |
|---|---|
| దండుప్రోలు ముత్యాలయ్యగారు | ఏలూరు |
| వాతాడ వీరయ్యగారు | ,, |
| కోపనాతి ముత్యాలుగారు | ,, |
| పోతాబత్తుల వెంకటరత్నముగారు | ,, |

| | |
|---|---|
| వనమాడ వెంకయ్యగారు | ,, |
| పైల ఘంటయ్యగారు | ,, |
| బుడపనేటి రామన్నగారు | ,, |
| లంకాడ ఆదినారాయణగారు | భీమిలిపట్నం |
| పాలేటి అప్పలస్వామిగారు | ,, |
| జి. గోవిందరావుగారు | జమ్‌షెడ్‌పూర్ |
| లక్ష్మం సత్యనారాయణుడుగారు | సికింద్రాబాద్ |
| కొపనాతి సీతారామయ్యగారు | బోడ్సకుదురు (గోదావరిజిల్లా) |
| బత్తి గోపాలస్వామిగారు | నర్సాపురము |
| కొపనాతి రామమూర్తిగారు | ,, |
| బొమ్మడి కృష్ణమూర్తిగారు | ,, |
| గువ్వల నరసింహులుగారు | రనూల్ కొండ |
| జి. రంగనాయకులుగారు | సుకడ |

# విషయసూచిక.

## ప్రథమప్రకరణము.



## ద్వితీయప్రకరణము.

## తృతీయప్రకరణము.



## చతుర్థప్రకరణము.

శ్రీరస్తు.

# పల్లవరాజచరిత్రము.

## ప్రథమ ప్రకరణము

### — * జన్మభూమి * —



మన మిప్పు డే రాజులచరిత్రమునుగుఱించి చదువఁబోవుచున్నారమో యట్టి పల్లవరాజుల జన్మభూమిని గుఱించి ప్రప్రథమమున యోజింపవలసియున్నది. మఱియు వీ రెచ్చటఁ బుట్టిరో, యెచ్చటఁ బెఱిఁగిరో యే యే దేశముల వ్యాపించియుండిరో యే కాలమునాఁటివారో యదియును దెలిసికొనవలసి యున్నది.

తొలుదొల్త హిందూదేశమందలి సాంద్రారణ్యప్రాంతములందును నవనాగరికులైన చెంచు, కోయ, ఎఱుక, భిల్లమున్నగుజాతులవారు మాత్రము నివసించుచుండిరి. అప్పుడాసియాఖండముయొక్క మధ్యప్రదేశమునుండి జబాహు:

మగుటచేతఁ గొందఱార్యులు గొండదారులనుండి పలుతావు లకు గా మొద లిడిరి.

ఇంగ్లీషువారును, జర్మనీవారును, డచ్చివారును,స్వీడన్ వారును మఱికొందఱును మధ్యాసియానుండి యప్పుడప్పు డు లేచిపోయి యూరపుఖండమునఁ బ్రవేశించినవారలే యై యుండిరి. వీరికి "ట్యూటన్" ఆర్యులనియు; స్పెయిన్,ఫ్రాన్సు, ఐర్లండు దేశీయులను "కెల్టిక్" ఆర్య లనియు; రష్యావారిని "స్లావ్" ఆర్యులనియు; ప్రష్యా,ఇటలీదేశస్థులను "ఇటాలిక్" ఆర్యులనియు; గ్రీసుదేశమువారిని "హెలనిక్" ఆర్యులనియుఁ బేర్కొనుచుందురు. వీ రెల్లరును యూరపు ఖండములోని యార్యులు. మఱికొంద ఱార్యులు మధ్యాసియాభాగమును వదలి పెషావరువద్దనున్న కనుమలమార్గమున నీదేశమునకు వచ్చి సింధునదీపశ్చిమప్రాంతమున స్థిరనివాసంబు లేర్పఱచి కొనిరి.

ఇట్లు హిమాలయపర్వతమునకును సింధునదికిని మధ్యఁ గల ప్రదేశమునందుఁ గొంతకాలమును దరువాత సింధూ వింధ్యాద్రులమధ్యఁ గొంతకాలమును బిమ్మట వింధ్యాద్రికిని గన్యాకుమార్యగ్రమునకును గల మధ్యభాగంబులఁ గొంత కాలమును దగువసతుల నేర్పఱచుకొనుచు నుండిరి. ఇట్లు మూఁడుభాగములుగ భాగింపఁబడిన హిందూదేశములోని

మొదటి భాగములో సింధునదికి వాయువ్యదిశయందుఁ గల కొండప్రదేశము సరస్వతీ దృషద్వతీ నదులమధ్య గలదై మిక్కిలి పవిత్రభూమిగ నెంచఁబడుచుండెను. దీనికి—

"శ్లో॥ సరస్వతీదృషద్వత్యో ర్దేవనద్యోర్యదంతరం
తం దేవనిర్మితం దేశం బ్రహ్మావర్తం ప్రచక్షతే॥"

అను మనుస్మృతి వాక్యానుసారముగ బ్రహ్మావర్తదేశమని యందురు. హిమాలయమునకును వింధ్యాద్రికిని నడుమ నుండు దేశమార్యావర్తమనఁబడుచుండెను. ఎట్లన—

"శ్లో॥ ఆసముద్రాత్తువైపూర్వా దాసముద్రాత్తుపశ్చిమాత్
తయోరేవాంతరం గిర్యో రార్యావర్తంవిదుర్బుధాః॥"

అని మనుస్మృతియందుఁ గలదు. వింధ్యాద్రికి దక్షిణభాగమే దక్షిణాపథమని వ్యవహరింపఁబడుచుండెను. ఆర్యులీ విధముగ మధ్యాసియానుండి హిందూదేశమందలి వివిధ భాగములందును స్థిరనివాసము లేర్పఱచుకొని యచ్చటి యాచార వ్యవహారముల ననుసరింపుచుఁ జిరతరములుగ నిందే యుండినవారగుటచే వీరిని విదేశీయులని చెప్పుట సమంజసము గాదనియు వీరు హిందువులే యనియుఁ జరిత్రకారులు సెప్పుచుండిరి.

ఇట్లు కాలక్రమమున వచ్చి నివాసంబు లేర్పఱచుకొనిన వారిలోఁ బహ్లావులని చెప్పఁబడు పల్లవులొకరై యుండిరి. ఈ

పల్లవులను గుఱించి యాంధ్రుల చరిత్రమునం దిట్లు చెప్పఁబడి యుండెను.—"పల్లవులు స్వదేశస్థులని కొందఱును విదేశస్థులని కొందఱును భిన్నాభిప్రాయులై యున్నారు. మొదట నాంధ్రదేశమునుండియె దక్షిణమునకుఁబోయి యుండిరను విషయమును మాత్రము చరిత్రకారులెల్ల రంగీకరించియున్నారు. విదేశస్థులని చెప్పఁబడు వారిని దేశ మతాచారముల నవలంబించి దేశీయులలోఁ గలిసి బహు శతాబ్దములు నివసించి యుండి తమ తొంటి జన్మస్థానమును మఱచి తాముండిన దేశమే తమ దేశముగ భావించుకొనుచు దేశపరిపాలనము చేసిన పల్లవులను విదేశస్థులనుగఁ బేర్కొనుచుండుటయు, స్వదేశస్థులని చెప్పఁబడువారిని బహురాజ్యములను సంపాదించి రాజాధిరాజులై నిర్వక్రపరాక్రమంబును జూపి దేశపరిపాలనము చేసిన వారిని దారిదోపిడిగాండ్ర తెగలోఁ జేర్చి పేర్కొను చుండుటయు వింతగఁ గన్పట్టకమానదు. ఏ దేశస్థులైనను, నేజాతివారైనను నీ దేశమునకువచ్చి యీ దేశ మతాచారముల నవలంబించి యీ దేశనామముల నలంకరించుకొని యీ దేశమే తమ మాతృదేశముగ భావించుకొనినవారిని స్వదేశస్థులనుగానే పేర్కొనవలసి యుండును గాని కడవఱకు విదేశస్థులుగానె భావించి యట్లు పేర్కొనుచుండుట కేవలము పొఱపాటని చెప్పఁదగును. గోదావరీనది నాసికాత్ర్యంబకము కడ జనించి సముద్రములోఁ గలియుటకు నడుమ నెన్నియో

యుపనదు లెచ్చ టెచ్చటనో పుట్టి వేర్వేఱు నామములతోఁ బ్రవహించుచువచ్చి గోదావరీమహానదిలోఁ గలియు చున్నవి గదా! అట్లు వరద, మంజీర, ప్రాణహిత, ఇంద్రావతి మొదలగు నుపనదులు వచ్చి గోదావరిలోఁ గలియు చున్నను నా గోదావరిలోని జలమునుగుఱించి ప్రసంగింపవలసి వచ్చినప్పుడు వరదానదీజల మనికాని, మంజీరానదీజల మనికాని, ప్రాణహితానదీజల మనికాని, యింద్రావతీనదీజల మనికాని పిలువక గోదావరీజల మనియె పిలుచుచున్నారము. అట్లే యే దేశస్థులయినను నే జాతివారయినను నాంధ్రదేశమునకు వచ్చి, యాంధ్రదేశ మతాచారముల నవలంబించి యాంధ్రుల వేషభాషల నలవరించుకొని యాంధ్రులతో సంబంధ బాంధవ్యముల నెఱపుచు నాంధ్రమహాజనసంఘములోఁ గలసిపోయిన వా రాంధ్రులుగానే పరిగణింపఁ బడఁదగినవారుగాని యన్యులుగాఁ బరిగణింపఁ బడఁదగిన వారుగారు. ఆంధ్రులలోఁ గలసిపోయిన పల్లవులయొక్క పూర్వులయిన పహ్లావులయొక్క జన్మస్థానము పారశీక మైనంత మాత్రముచేతఁ బల్లవులను బారశీకులనుగ భావించి విదేశస్థులనుగఁ బరిగణించుట యొప్పిదమైన విషయముగాదు." దీనిని బట్టి చూడఁగఁ బల్లవు లాంధ్రులనియె స్పష్టమగుచున్నది. వీరు విశేషముగ నెలకొని పాలించిన ప్రదేశమే పల్లవనాడనియు నదియె పల్నాడయ్యెననియుఁ జెప్పుదురు.

ఈ పల్లవులు రాజ్యకాంక్షచే ద్రవిడదేశములఁ జొరబడి యందు రాజ్యస్థాపన మొనరించుకొనినంత మాత్రమున వీరు ద్రవిడజాతులలోని వారుమాత్రము కారనుట స్పష్టము. ఈ విషయమై విన్సెంటు స్మిత్తుగారిటుల వ్రాసిరి—"చెన్నపురి రాజధానికి నుత్తరభాగమున ననఁగాఁ గృష్ణా గోదావరులకు నడుమనుండిన, వేంగిదేశమున నేర్పడిన యొక తెగవారని కన్పట్టుచున్నది. ద్రవిడరాజ్యములతోఁ గల విడువని శత్రుత్వమును, బల్లవుల కిడియని నిర్దేశింపఁబడిన ప్రదేశము లేకుండుటయును జూడఁగ బల్లవులు తమిళజాతికి భిన్నమైనజాతియనుటకు గుర్తుగ నున్నది. దక్షిణభాగమంతయు నాక్రమించిన పాండ్య, చేర, చోళరాజులపైని వారియధికార మధికముగఁ గూడ విధింపఁబడుచువచ్చెను." ఇట్లగుటచే నీపల్లవులు తమిళజాతులలోని వారుగాక యాంధ్రులనియే స్పష్టమగుచున్నది.

ఆంధ్రదేశమునఁ జిరకాలముగ నెలకొనియున్న నీపల్లవులె పహ్లావులనియు నీపహ్లావులు దొలుతఁ గందహారము, పెయిస్తానులలోనుండి గాండఫరేసు కాలములో ననఁగాఁ గ్రీస్తుశకము 20 వ సంవత్సరమునకును 60 వ సంవత్సరమునకును నడుమను బంజాబ్ యొక్క పశ్చిమభాగమునకును సింధునది ప్రవహించు పల్లవుభూములకును వచ్చి ప్రవేశించిరి. సింధునది ప్రవహించు పల్లవుప్రదేశములు పార్థియనుల స్వాధీనములో నున్నవనియుఁ దమలోఁ దాము పార్థియనులు పోరాడుకొను

చుండిరనియుఁ గ్రీస్తుశకము 80 వ సంవత్సరమున రచింపఁబడిన "పెరిప్లస్" అను గ్రంథమునందుండినట్లు "ఇండియన్ అంటిక్వేరి" 8 వ వాల్యూం 338 వ పేజీలోఁ గలదు. దీనినిబట్టి చూడఁగ పార్థియనులు, పహ్లావులు పల్లవులు నొకజాతికి చెందుదురనియు, నీజాతివా రుత్తరదేశమునుండి యాంధ్రరాజ్యమునకు వచ్చి యాంధ్రులతో సంబంధబాంధవ్యములఁ గావించుకొనియు, నాంధ్రాచారముల నవలంబించియు నాంధ్రులుగఁ బరిగణింపఁబడుచుండినట్లు తెలియుచున్నది.

కాని ద్రవిడదేశమునుండి మాత్ర మాంధ్రదేశమునకు వచ్చినవారు గారు. మఱియు నుత్తరదేశమునుండి యాంధ్రదేశమునఁ బ్రవేశించిరనియు, నందుండి యాంధ్రాచారముల నలవఱచుకొని యాంధ్రు లైనట్లు మఱికొంద ఱాంధ్రదేశమునుండి రాజ్యకాంక్షచే ద్రవిడదేశమునకును వ్యాపించి యుండను స్థిరనివాసము లేర్పఱచుకొని ద్రవిడాచారముల నవలంబించి కొంతకాలమునకుఁ దమపూర్వదేశవేషభాషాదుల మఱచి తాము ద్రావిడుల మనుకొను వారును మఱికొందఱు గలరు మఱియు నొకానొకప్పు డొక్కకుటుంబమునకుఁ జెందిన సోదరు లిరువురిలో నొకరు ద్రవిడదేశమునకును మఱియొక రాంధ్రదేశమునకును బ్రభువులై యుండి తరతరములవఱకు స్థిరముగ నిలిచిపోయి ద్రవిడదేశములోనివారు ద్రావిడులుగను నాంధ్రదేశములోనివా రాంధ్రులుగను బరిగణింపఁబడుటయుఁ

దటస్థించి యేకకుటుంబీకులం దేయిట్టి భేదము లేర్పడెను. కావున నాంధ్రదేశములో నున్నవా రాంధ్రులమనియు, దమిళదేశము లోనున్నవారు దమిళులమనియుఁ జెప్పికొనుచుండుట న్యాయ మయినను వీరెల్లరును నుత్తరభాగమునుండి ప్రవేశించినవారె గాని యన్యులుగారు.



## —* పల్లవశబ్దోత్పత్తి. *—



ఈ పల్లవశబ్దోత్పత్తిని గుఱించి పురాణగాథ లిట్లుగలవు. "జంబూద్వీపమునందలి మానవకోటిని బరిపాలించుట కొక వీరపురుషుండైన పాలకుండు గావలసియుండెనని ఋషులెల్ల రును హిమాచలమునకు నైరుతిదిశయందుఁగల శిఖరమునఁ దపస్సుసేయుచు జంబూమహర్షి నొక యజ్ఞమును జేయఁ బ్రార్థించిరి. అంత నాఋషివరేణ్యుఁడు పాలాశసమిధలఁ గొని వచ్చి యజ్ఞగుండమునందుంచి యజ్ఞము సేయఁగ నపు డా యజ్ఞగుండమునుండి సాయుధబాహుండగు నొక వీరపురుషుం డుద్భవమయ్యెను. ఇందులకు నిదర్శనముగ భారతములోని యరణ్యపర్వమునందు మార్కండేయ సమస్యా వర్గ 220 వ యధ్యాయమున 5వ శ్లోక మిట్లు వాకొనుచున్నది—

"శ్లో॥ అగ్నిశ్చాపి మనుర్నామ ప్రాజాపత్యో మకారయాత్
జంబుమగ్ని మథ ప్రాహుః బ్రాహ్మణా వేదపారగః॥"

జంబూమహర్షిచేఁ జేయఁబడిన యజ్ఞగుండమునందు వేదపారంగతులైన బ్రాహ్మణులచేఁ గొనియాడఁబడెడి మనువుద్భవించెనని తాత్పర్యము. మఱియుఁ బై శ్లోకములోని 'మకారయాత్' అనఁగా మకారస్వరూపుఁడని భావము. మకారస్వరూపుఁడనఁగా నగ్నిస్వరూపుఁడు. ఎట్లనఁగాఁ బరబ్రహ్మమూర్తియైన భగవంతుఁడు ప్రణవస్వరూపుఁడు. ప్రణవము 'ఓం' కారస్వరూపము. అట్టి ఓం కారము, 'అ' కార 'ఉ' కార 'మ' కారములఁ గూడినదైయున్నది. వీనిలో 'అ' కారము కుడివైపు సూర్యనాడి 'పింగళ' యనియు 'ఉ' కార మెడమవైపు చంద్రనాడి 'యిడ' యనియు 'మ' కార మీయిడాపింగళులమధ్యఁ దేజోమయమగు 'సుషుమ్న' యనియుఁ జెప్పఁబడును. ఈసుషుమ్ననాడి తేజోరూపమగు నగ్నిస్వరూపమగుటచే నగ్నిగుండమునం దుద్భవించిన మనువును వీని సంతతియు నగ్నికులులనియు, మకారులనియు వ్యవహరింపఁ బడుచుండెను. మకారుఁడను శబ్దమె కాలక్రమమున మరకాఁడయ్యెనని యూహ్యము.

అగ్నిసంభూతుఁడైన యీ స్వాయంభువమనువుసంతతినుండి సూర్యవంశజులనఁబడు నిక్ష్వాకుఁడు, రఘువు మున్నగువారును, జంద్రవంశజులనఁబడు బురూరవుఁడు మున్నగువారును

నుద్భవించిరి. ఇటుల సూర్యచంద్రాగ్నివంశజులై క్షాత్ర ధర్మంబులు గల యీ త్రివిధవంశ క్షత్రియులును బరస్పర సంబంధ బాంధవ్యములఁ గలిగి ప్రబలిరి.

ఇట్లగ్నినుండి క్షాత్రధర్మములతో నుద్భవించిన నీ క్షత్రియులు భూపాలనమువహించుటచేఁ బార్థివులై పార్థివశబ్దమే పార్థియనులుగ మారి యుండవచ్చును. ఈ పార్థియనులనే పహ్లావులనియుఁ బల్లవులనియు వ్యవహరించుచుండినట్లు మన మింతకుఁబూర్వము చదివియున్నారముగదా!

మఱియును జంబుకమహర్షి యజ్ఞమును జేయునప్పుడు పాలాశ (తెల్లమోదుగు) సమిధల నుపయోగించుటచేతను, 'పాలా' యనఁగ సంస్కృతభాషయందుఁ బాలించువాఁడని యర్థమిచ్చుచుండుటచేతను నిట్టిపాలాయను ధాతువునుండియే పల్లవశబ్దము జనించెననియుఁ జెప్పుదురు. సంస్కృతమున నుండిన యీ పల్లవశబ్దము ప్రాకృతభాషయగు పాలీభాష యందు 'పల్లీ' యని దైనట్లు నాగవర్మ విరచిత కన్నడ ఛందస్సునందు వివరింపఁబడి 'పల్లి' అనఁగఁ బాలించువాఁడని యర్థము గలిగియున్నట్లు వ్రాయఁబడి యున్నది. మఱియు నమ్మాళ్వారు మొదలగు వైష్ణవ మతోద్ధారకుల వైష్ణవ వేద మగు నాలాయిర ప్రబంధమునం దీపల్లి శబ్దమునకుఁ బాలించువారి కర్థమున్నటుల విశదముగఁ దెలుపఁబడియున్నది.

ఈ పల్లిశబ్దమును గుఱించి 1798 వ సంవత్సరమున లండనునగరమందు రివరెండు మారీసు ప్రచురించిన 'పల్లి చరిత్రము' యొక్క యోటవ సంపుటములో 142 మొదలు 146 వ పుట వఱకు సీ పల్లిశబ్దముయొక్క యౌన్నత్యము తెలుపఁబడి యున్నది.

డాక్టరు రాబర్టు దొరవారు వ్రాసిన తమ హిందూ దేశ చరిత్రమునందు—సంస్కృతమునఁ బల్లవుఁడనుటకన్న నా కాలమున వాడుకలోఁగల పాలీభాషను బల్లీలనుట యున్నత పదవిని గలుగఁజేయు భావ మిచ్చుచున్నదనియు నా కారణముచేతఁ గ్రీస్తుపుట్టుటకుఁ బూర్వము 590 సం॥న వచ్చిన గౌతమబుద్ధుఁ డాకాలమునఁ బల్లవరాజుల నండఱను లోఁబఱచుకొని తన మతమును నుపదేశించు సందర్భమున వీరిని బల్లవులని పిలుచుటకన్నఁ బల్లీలని పిలుచుటయె ఘనవాచకమని ప్రజలకు బోధించి యీ బల్లవ శబ్దమును బల్లీ శబ్దముగ మార్చినట్లుఁ దోఁచుచున్నదని వివరించియుండిరి.

—✻ అగ్నివంశ మనునది కలదు ✻—

సూర్యచంద్ర వంశజులే గాక యగ్నివంశజులును గల రనుటకుఁ బెక్కు నిదర్శనములు గలవు. వానిలో—

1 మహాభారతము—అరణ్యపర్వము 220వ అధ్యాయము 5వ శ్లోకమునందు—

“శ్లో॥ అగ్నిశ్చాపిమనుర్నామ ప్రాజాపత్యమకారయత్
శంభుమగ్ని మథప్రాహుః బ్రాహ్మణా వేదపారగాః॥”

అనఁగ నగ్నివంశజులగు పురందరుఁడు, ఊష్మ, మనువు లనుమూఁవురు పుత్రులలో మనువను వాఁడు రాజ్యము చేసినట్లును నావంశమందలి శంభుఁడను మఱియొక రాజును వేదపారగులైన బ్రాహ్మణులు స్తుతిచేసినట్లును గానఁబడుచున్నది.

2 మహాభారతము—222 వ యధ్యాయము 1 వ శ్లోకమునందు—

“ అగ్నీనాంవివిధావంశాః కీర్తితాస్తేమయానఘః
శృణుజన్మతుకౌరవ్య కార్తికేయస్యధీమతః॥”

తా॥ వివిధములైన యగ్నికులులం గూర్చియు సవిస్తరముగఁ జెప్పియుంటిని. ఓ పాపరహితుఁడవైన కురురాజపుత్రా! ఇఁకఁ గార్తికేయుని చరిత్రమును వినుము.

3 భాగవతము—అష్టమస్కంధము ప్రథమాధ్యాయము 20 వ శ్లోకమునందు— .

“ శ్లో॥స్వారోచిషో ద్వితీయస్తు మనురగ్నేస్సుతోభవత్
ద్యుమత్సుషేణరోచిష్మ త్ప్రముఖా స్తస్యచాత్మజాః॥”

తా॥ స్వారోచిషుఁడను రెండవమనువు వగ్నికుమారుఁడనియు నతనికి సుద్యుమ్నుఁడు, సుషేణుఁడు, రోచిష్మంతుఁడు మొదలుగాఁగల తనయులు గలిగిరి.

అగ్నిశబ్దమునకుఁ బర్యాయశబ్దమగు వహ్ని (వన్ని) శబ్దమును రాజపరముగఁ బురాతన ద్రవిడ గ్రంథములందు నుపయోగింపఁబడినట్లు పెక్కు నిదర్శనములు గలవు. ఎట్లన—

రామాయణము ఉత్తరకాండము తిరువాలక్క పలము 11వ పద్యము:—

"కొడిమన్ను మాడక్కూలమెన్ను మయోద్ధియె యృది
క్కడిమన్ను వాయిర్కడై నింద్రరుల్ కాలనోక్కి
ప్పడిమన్ని వాళుమ్ పలవన్నియర్ మండలీగర్
ముడిమన్న రెల్లాముఱై యేప్పుగుందేవల్ కేడ్క"

తా॥ అనేకములగు టెక్కెములతో నొప్పుచుండు సౌధములచే వెలయు నయోధ్యను జేరి సమయోచిత రక్షితార్థమగు పురద్వారమున వేచియుండి యనేక "వన్నియులు" చక్రవర్తులు కిరీటధారులగు రాజులును బురముఁ జొచ్చి రాజాజ్ఞలకు నిరీక్షించియుండిరి.

ఇట్లు వన్నియర్ శబ్దము రాజపరముగఁ జెప్పఁబడియుండుటచేత నగ్నికులులను నొకతెగ చిరకాలమునుండి యుండినట్లును, వీరు ప్రజాపాలకులై యుండినట్లును స్పష్టమగు

చున్నది. ఇట్టినిదర్శనములను ద్రవిడగ్రంథములనుండి పెక్కులు చూపవచ్చును. ఇంగ్లీషు చరిత్రకారులును నీవిషయములను స్పష్టపరచుచున్నారు. ఎట్లన—

వాల్టర్ హామిల్టన్ దొరగారు వ్రాసిన The Goegraphical, Statistical and Historical description of Hindustan and the adjacent countries' అను గ్రంథము యొక్క రెండవభాగములో 525వ పుటయం దిటులఁ జెప్పఁబడియున్నది.

* వన్నీ—సింహళద్వీప మధ్యభాగమున నీశాన్యదిశను తిరుక్కణామలై యను పర్వతపార్శ్వమున నున్న యొకజిల్లా. ఇది యొక చక్కని చదరపుభూమి. అనేకసమయము లందాదేశపు వన్నియులు (రాజులు) 'కండి' రాజులకును వారి యైరోపీయ శాత్రవులకును జరుగు యుద్ధముల నవకాశము చేసికొని తమ స్వతంత్రాధికారములను స్థాపింపఁ బ్రయత్నించిరి గాని వారు మిదకుఁ దమదేశమునందుఁ బ్రజలు తమ్ము విడిచి పోవుటచే డచ్చివారికి లోఁబడవలసిన వారైరి.

* Wanny, a district in the interior of Ceylon, situated towards Trincomale in the north-east quarter. This is a fine flat country. At different periods it's Wannies or princes, taking advantage of the wars between the Candian sovereigns and their European enemies, endeavoured to establish an authority after their Country had been much desolated by all parties ubmitted to the Dutch."

దీనిని బట్టిచూడ సింహళమధ్య ప్రదేశమును వన్నిలను రాజులు పరిపాలించినట్లు స్పష్టమగుచున్నది.

మఱియును దిరునల్వేలి మండలమునఁగల * శ్రీవల్లిపుత్తూరునకు దక్షిణమున 20 మైళ్ళ దూరమునఁ గల కొన్ని కొండలక్రింద 'శివగిరి' యను నొక బలిష్ఠమైన కోట గలదనియును దాని నాధారముఁ జేసికొని యాప్రాంతదేశము నొక వన్నియ ప్రభువు పాలించుచుండినట్లును రాబర్టు ఓరం (Robert Orme Esq., F.A. S.) దొరగారు 'కొనమూండలు యుద్ధమును గుఱించి వ్రాయు సందర్భమున వ్రాసియున్నారు.

ఈ వన్నియులలోఁ బురుషులేగాక స్త్రీలును బరిపాలించినట్లు దేశ చరిత్రలవలనఁ దెలియఁగలదు. ఎట్లన — సర్. జి. ఈ. టిన్నెంట్. కె. సి. యస్., యల్. యల్. డి. దొరగారు వ్రాసిన సిలోను చరిత్రయందు — ‡ ఇప్పటి కాలములో 'వన్ని' దేశము 'వన్నియు'లని పిలువంబడు స్వదేశ రాజులచేతను నప్పుడప్పుడు 'వన్నిచ్చి' లను బిరుదువహించిన రాజస్త్రీలచేతను బాలింపఁబడుచుండెను.

---

* "Other Polygars of less note were accompanied by Vanniah of Sivagiri, a very large collery fort, situated at the foot of the hills, about 20 miles south of Chevelpetore"

‡ "In modern times the Wanny was Governed by native princes styled Wannyahs and occasionally by females with the titles of Wannichees."

అగ్నికులులు చిరకాలమునుండియిప్పటిదనుకఁ గలరను విషయమును గుఱించి 'డాక్టరు ఆపర్టు' దొరగారు 1887-88 సంవత్సరమునఁ బ్రచురించిన మద్రాస్ జర్నల్ ఆఫ్ లిటరేచర్ అండు సైన్సు అను మాసపత్రికయొక్క 18వ పుటయందు *ఉత్తర దక్షిణ హిందూస్థానముల నీ యగ్నికులస్థులు (వహ్నియులు) వ్యాపించి యుండిరను విషయము నిశ్చయమైనదిగ నున్న దని వ్రాసిరి.

“ఇట్లు ప్రజాపాలనాధికారులుగనున్న యీవహ్నియులు ప్రస్తుతమున ననామకులుగను స్వల్పులుగను నుండినను బూర్వకాలమున దక్షిణహిందూస్థానమున నుండిన జాతులలో మిక్కిలి యౌన్నత్యమును బొందిన పూర్వీకుల సంతతి వారని నమ్ముటకుఁ దగిన కారణములు గలిగియుండినవని జె. హెచ్. నెల్సన్ (J. H. Nelson) దొరగారు దమ మధుర జిల్లా చరిత్రమున రెండవభాగము 50వ పుటయందు § వ్రాసిరి,

*“The existence of these fire races, Agnikula or Vahnikula (Vanniyans) in north and south India is a remarkable fact”

§ The Vannies are at the present time a small and obscure agricultural caste, but there is reason to believe that they are the descendants of ancestors, who in former times held a good position amongst the tribes of southern India.”

# అగ్నియం దుద్భవించిన తదితరులు.



అగ్నిగుండము నం దుద్భవించుట సంభవమాయని యిప్పటి చరిత్రకారులకు సందేహము గలుగవచ్చునుగాని మన శాస్త్ర విశ్వాసము గలవారికి మనపురాణముల నుండి యిట్టివి పెక్కులు సూపవచ్చును. పంచమవేద మనఁ బరగిన భారతమునందు ద్రౌపదీధృష్టద్యుమ్నుల జనన ప్రకార మిట్లు గలదు—

తొల్లి ద్రోణుండును ద్రుపదుండును బాల్యదశయందు సహపాఠకులై వేదాధ్యయనంబును ధనుర్విద్యయు సమగ్రంబు గఁ జదివిన పిమ్మటఁ గొంతకాలమునకు ద్రుపదుండు పాంచాల దేశమునకుఁ బ్రభు వయ్యెను. అంత ద్రోణుండు దన బాల్య సఖుండైన ద్రుపదు దర్శింపఁబోవఁగా నా ద్రుపదుండు రాజ్య గర్వముచే ద్రోణు నవమానితుఁ జేయఁగ ద్రోణుం డందుండి మఱలి కురుపాండవులఁ జేరి వారికి ధనుర్విద్యా ప్రావీణ్యంబును గఱపి వారిని శస్త్రాస్త్రకోవిదులఁ జేసెను. అంతఁ గౌరవ పాండవులు దమ యాచార్యులవారికి గురుదక్షిణ నొసఁగ యోజింపుచుండఁగ ద్రోణుండు దనకు ద్రుపదుచేఁ గల్గిన యవమానంబును స్మరణకుఁ దెచ్చికొని తన శిష్యులతో ద్రుప దుని పట్టితెచ్చి యిచ్చుటయ తనకు గురుదక్షిణ గాఁగల దని నుడువఁ దత్క్షణమ కౌరవులు వోయి ద్రుపదుచేఁ బరాజితు

నై వచ్చిరి. కాని యర్జునుఁడు మాత్ర మట్లుగాక ద్రుపదుని బట్టి తెచ్చి ద్రోణున కర్పింపగా ద్రోణుఁ డాతని నుల్లసోక్తు లాడి విడిచిపుచ్చె. అంత ద్రుపదుఁ డట్టి యవమానంబు భరింపఁ జాలక తన్నవజ్ఞసేసిన ద్రోణుఁ గడతేర్పఁగల యొక పుత్రుని, దన్ను సైతము నిర్జింపఁగలిగిన యర్జును బలపరాక్రమాదులకు సంతసించి వాని జామాతగఁ జేసికొన నొక పుత్రికను గాంచ వలెనని కృతనిశ్చయుండయి యాజుండను మహర్షిం గాంచి—

కం. మునినాథ! నాకు సత్సుత
జననంబగునట్టి క్రతువు ♦ సద్విధిఁ గావిం
చినఁ గృతకృత్యుఁడ నగుదుఁ
గొను మిచ్చెద నీకు లక్ష ♦ గోధేనువులన్ ॥

కం. భారతవంశాచార్యుఁడు
భారద్వాజుండు నాక ♦ పాయము సేసెన్
ఘోరాజి నతని నోర్చు న
పారపరాక్రము సుపుత్రుఁ ♦ బడయఁగ వలతున్ ॥

(భారతము—ఆది. 7-13, 14)

అని ప్రార్థించెను. అందుల కా ఋషి సమ్మతించి ద్రుపదునిచేఁ బుత్రకామేష్టి సేయించె నందు మంత్రాహుతులచేఁ దృప్తుం డయిన యగ్నిదేవు వలన—

కం. జ్వాలాభీలాంగుఁడు కర
వాల బృహచ్చాపధరుఁడు ♦ వరవర్మకిరీ

టాలం కాడుఁడు వహ్నియ
పోలె రథారూఢుఁడొక్క • పుత్రుఁడు వుట్టెన్॥
(భారతము—ఆది. 7-17)

తరలము

కులపవిత్రసితేతరోత్పల • కోమలామలవర్ణ యు
త్పలసుగంధి లసన్మహోత్పల • పత్ర నేత్ర మదాలికుం
తలవిభాసిని దివ్య తేజముఁ • దాల్చి యొక్క కుమారి ద
జ్వలనకుండమునందుఁబుట్టెఁ బ్ర • సన్నమూర్తిముదంబుతో॥
(భారతము—ఆది. 7-19)

ఇట్లు ద్రుపదుఁ డొనరించిన యజ్ఞకుండమునుండి దృష్ట ద్యుమ్నుండును, ద్రౌపదియు జన్మించి రని యుండెఁగదా! మఱియు స్వారోచిషుఁడను రెండవమనువగ్నికుమారుఁడనియు నతనికి సుద్యుమ్నుఁడు, సుషేణుఁడు, రోచిష్మంతుఁడు మొదలు గాఁగల తనయులు గలరనియుఁ జెప్పఁబడెను. ఈ విషయము భాగవతము యొక్క యష్టమస్కంధమునఁ బ్రథమాధ్యాయము లో నిరువదియవ శ్లోకమున నిట్లు గలదు—

"శ్లో॥ స్వారోచిషో ద్వితీయస్తు మనురగ్నేస్సుతోభవత్
ద్యుమత్సుషేణరోచిష్మ త్ప్రముఖా స్తస్యచాత్మజాః॥"

ఈ విషయమే ద్రవిడభాగవతముయొక్క యష్టమస్కంధమునఁ గూడఁ గలదు. అందు—

"ఇయం బిరండాంజీర్ మనువినై యురైక్కిలింగు మక్కినిమునమీంద్ర । నయిందరు శువారోశిడనవనులగం నవై యుఅక్కాట్కుణాళ్." (అగ్నికులదీపిక — పుట 17)

అనఁగా నీ రెండవమనువే స్వారోచిషమనువు. బహుకాలముక్రిందఁ దేజోవంతుఁడైన యగ్నికి పుట్టి రాజ్యభారమును వహించియుండెను. ఇట్టి నిదర్శనముల ద్రవిడగ్రంథముల నుండి పెక్కులు చూపవచ్చును. మఱియు నితర పురాణముల నుండియు భావనాఋషి మున్నగువా రగ్నినుండి పుట్టినట్లు గాథలు గలవు.

ఈ విధముననే జంబూమహార్షి యొనరించిన యజ్ఞకుండమునుండి స్వాయంభవమనువు జన్మించి యగ్నికులు లనఁబడువారికి మూలపురుషుఁడై విరాజిల్లెను. ఈకారణముచే వీని సంతతివా రగ్నికులులనియు, జంబుకుల గోత్రజులనియు వ్యవహరింపఁబడుచుండిరి. వీరిలో గొందఱు సూర్యోపాసకులయి రవికుల గోత్రులనియు వ్యవహరింపఁబడుచుండిరి. జంబుకుల గోత్రజులు తమిళదేశమునందును, రవికుల గోత్రజులాంధ్రదేశమందును విశేషించి గలరు. వీరుగాక సాలంకాయన గోత్రులనియు, బృహత్పలాయన గోత్రులనియు వ్యవహరింపఁబడువారు మఱికొందఱును గలరు.

## —* భారద్వాజగోత్రులన నేమి? *—



దక్షిణదేశమును బరిపాలన మొనరించిన వారిలోఁ బాండ్యులు, చోళులు, కేరళులు, చాళుక్యులు, గాంగులు, కాకతీయులు మున్నగువారు సూర్యవంశక్షత్రియుల మనియుఁ జంద్రవంశ క్షత్రియుల మనియుఁ బల్లవు లగ్నికుల క్షత్రియుల మనియుఁ జెప్పికొనిరి. వారిలో చోళులు సూర్యవంశజులు. పాండ్యులు చంద్రవంశజులు. కేరళులు సూర్యవంశజులు. చాళుక్యులు, రాష్ట్రకూటులు చంద్రవంశజులు. వీరి పూర్వీకులు గూడ మన పురాణములందుఁ జేర్పఁబడిన మహారాజులై యుండిరి. చోళులకు మనువు, ఇక్ష్వాకు, మాంధాత ముచికుందుఁడు, శిబి పూర్వీకులై యుండిరి. పాండ్యులకు బురూరవచక్రవర్తి మూలపురుషుఁడుగఁ జెప్పఁబడెను. చేర రాజులకు సగరుఁడు, భగీరథుఁడు, రఘువు, దశరథుఁడు, రాముఁడు మూలపురుషులైరి. చంద్రవంశ రాజులనే చాళుక్యులును జేర్పఁనిరి. రాష్ట్రకూటులు యదువంశజులై సాత్యకి సంతతి వారమనిరి. చంద్రవంశజులైన పురూరవుఁడు, ఆయువు, నహుషుఁడు యయాతి, దుర్వసుఁడు దుష్యంతులుగఁ గళింగ గాంగులు సెప్పికొనిరి.

పాండ్య చోళ కేరళాదులు పల్లవులవలెనే బ్రహ్మావర్తమునుండి దక్షిణాపథమునఁ బ్రవేశించి పాలించుచుండిన వారై

నను వీరిని క్షత్రియవంశజులనుగఁ జేరొ్కని పల్లవులను మాత్రము బ్రహ్మవంశజులనుగను, బ్రాహ్మణ గోత్రజాతులు గను జెప్పుటకుఁగల కారణములఁ జరిత్రకారు లిట్లు చెప్పుచుండిరి. "పల్లవులకును పాండ్యులకును గర్భ శత్రుత్వముగలదు. పాండ్యులు దాము పాండవసంతతి వారమని చెప్పికొన మొదలుపెట్టిన నాఁటనుండియుఁ బాండవులను బంధుమిత్రపరివారముగ నిర్మూలము చేసినవాఁ డశ్వత్థామయగుటచేతను, భారతమునం దశ్వత్థామ ద్రోణపుత్రుఁడుగను భారద్వాజుని మనుమఁడుగను జెప్పఁబడియుండుటచేతను, అశ్వత్థామ పాండవబలమును నిర్మూలము చేసినట్లుగఁ బాండవుల సంతతి వారమను పాండ్యుల బలమును దాము (పల్లవులు) నిర్మూలము చేయఁగలమని సూచించుటకో యనునట్లశ్వత్థామకుఁ బల్లవుఁడు జనించెననియు నాపల్లవుని వంశజులే తామనియు నందుచే దమది పల్లవవంశమనియుఁ జెప్పికొనుచుండిరి. కాని నిజముగ నశ్వత్థామకు జనించిన పల్లవుని వంశజులే యైనయెడల నయథార్థములును, వ్యత్యస్తములును నగు విషయములను వంశచారిత్రములందుఁ జెప్పికొనక యుందురు. అశ్వత్థామ బ్రహ్మచారియని మహాభారతమునుబట్టి మన మెఱుఁగుదుము. అశ్వత్థామకు భార్యలేదు. కనుక మదనికయను నొక యప్సరసను ముడిపెట్టిరి. పల్లవులు బ్రాహ్మణుల నాదరించి పోషించిరి. పాండ్యులు మొదట జైనమతావలంబకులుగ నుండిరి.

తరువాత శైవులయిరి. వీరు బ్రాహ్మణులకుఁ బ్రతిపక్షులుగ నుండిరి. కనుక బ్రాహ్మణులు దఱచుగఁ బల్లవుల పక్షమున నుండుచు వచ్చిరి. పల్లవుల శాసనములను వ్రాసినవారును బ్రాహ్మణులె గనుకఁ దమపక్షమును బూని తమ్ము నాదరించుట కొఱకు వారిని బ్రహ్మక్షత్రియులమని, భారద్వాజగోత్రు లని యశ్వత్థామసంతతివా రని వారల కుల్లాసము గలుగునట్లుగఁ బొగడి యిట్టివెన్నియో కల్పించి వారలను వశపఱచుకొనిరి. బ్రాహ్మణులు దమకార్యములను సాధించుకొని లాభమును బొందియుందురు. అశ్వత్థామ యాగ్రహమును జూపి విజృంభించినతోడనే భీమార్జునకృష్ణులు భయఁపడి పిఱికిపందలై యాయుధములను విడిచిపెట్టి చేతులను జోడించుకొని నిలువంబడిరని కాసకుడి తామ్రశాసనమునం దశ్వత్థామ పరాక్రమము వర్ణింపఁబడినది. ఇట్టివర్ణనలు పల్లవులను సంతోషపెట్టుటకుఁగాక మఱియెందులకు?"

—(ఆంధ్రులచరిత్ర—పుట 203)

ఈపై వ్రాఁతలనుబట్టి చూడఁగఁ గుక్షింభరులైన బ్రాహ్మణులు సుఖప్రీతికరంబులైన స్తోత్రపాఠంబుల నలిపి భారద్వాజగోత్రు లనియు, నశ్వత్థామసంతతివా రనియుఁ బొగడి యీవ్రాఁతలనె • శాసనములపైఁగూడ నెక్కించి పెక్కు మాన్యములను బహుమతిగఁ బడసియుందురు. కాని బ్రాహ్మణ విశ్వాసముగల యావాస్తవమైన పల్లవులు మాత్ర

మూత్రాంతలయందు భూషణమే కలదని సంతసించిరిగాని యందలి రహస్యదూషణమును గాని పరస్పర విరుద్ధవాక్యము లనుగాని పరిశీలింప రైరి. ఎట్లన శానకుడి తామ్రశాసనము నందు నశ్వత్థామకు మేనకయను నప్సరసయందుఁ బల్లవుఁడు జనించెనని చెప్పఁబడియుండెను. అమరావతీ శిలా స్తంభముపై సింహవర్మచే వ్రాయింపఁబడిన మఱియొక శాసనమునందు నశ్వత్థామకు మదనికయను నప్సరసయందుఁ బల్లవుఁడు జనించెనని కలదు. ఇంకను నిట్టివ్యత్యస్తము లెన్నియొ గలవు.

"కాంచీపురములోని (కంచి) కైలాసనాథుని దేవాలయములోఁగల యొక శాసనమున బ్రహ్మకు నంగిరసుఁడు, వానికి బృహస్పతి, వానికి సంయువు వానికి భారద్వాజుఁడు, వానికి ద్రోణుఁడు, వానికి నశ్వత్థామ వానికిఁ బల్లవుఁడు జనించె నని చెప్పఁబడియుండఁగఁ, గురము శాసనమున సంయువును నెగరఁగొట్టి బృహస్పతికి మనుమఁడుగఁ జెప్పఁ బడిన భారద్వాజుని పుత్రునిగఁ జేసి వర్ణించియుండెను. అమ రావతీశాసనములో బృహస్పతిని నెగరఁగొట్టి కురముశాసన మున నంగిరసునకు మనుమఁడుగఁ జెప్పఁబడిన భారద్వాజుని నంగిరసునకుఁ దండ్రిగఁ జేసి మధ్య సుధామునుఁ డను వానిఁ గల్పించి ద్రోణునకుఁ దండ్రిగఁ జేసెను. ఇంకను నిట్టి వైచిత్ర్య ము లీశాసనములోని వంశములందుఁ గన్పట్టుచున్నవి." ఇందు లకుఁ గారణమేమి? తదితరులకు వలె క్షత్రియ మూలపురుష

లనుగాక బ్రాహ్మణ గోత్రజులుగఁ జేయఁ దలకొన్న వాని యసభ్యలిఖితములే హేతుర్భూతములుగదా !

ఈపైనఁ బేర్కొన్న శాసనము లందలివంశవృక్షము లిట్లు గలవు:—



(2) కూరముశాసనము:— బ్రహ్మ
|
అంగిరసుఁడు
|
బృహస్పతి
|
భారద్వాజుఁడు
|
ద్రోణుఁడు
|
అశ్వత్థామ
|
పల్లవుఁడు

(3) అమరావతీశాసనము:— బ్రహ్మ
|
భారద్వాజుఁడు
|
అంగిరసుఁడు
|
సుధామానుఁడు
|
ద్రోణుఁడు
|
అశ్వత్థామ
|
పల్లవుఁడు

ఇట్టి వ్యత్యస్తము లనేకములు గలవు. కావునఁ బల్లవు లిప్పు డున్నట్లు జంబుకులగోత్రజులును రవికుల గోత్రజులును నగుదురు గాని భారద్వాజగోత్రజులుమాత్రము కారనియు నట్టి వ్రాఁతలు ముఖప్రీతిజనితలిఖితము లనియు స్పష్టము.



—* బి రు ద ము లు *—



ఈ పల్లీ లొకప్పుడు కొంత సైన్యమునకును గొంత భూభాగమునకును నాయకులుగను బ్రభువులుగను నుండినట్లు వీరినామముల తుద నేఁటిదనుకఁ జేర్పఁబడు గౌరవవాచకమైన 'నాయకర్' శబ్దమె వీరి నాయకత్వమున కొక నిదర్శనముగ నున్నది. వీరి వంశీకు లొకప్పుడు గొప్పసైన్యమునకు నాయకులుగను గొంతదేశమునకుఁ బాలకులుగను నుండుటచేత నే యిట్టి నాయకశబ్దధారు లైరి.

వీరు "పడైయాచి, కండర్, రాయర్, వాశండైయార్, భూపతి, ఉదరియార్, చోళనార్, అంజాదశింగం, మళువరాయర్, శంభురాయర్" అను బిరుదములం గూడ ధరించి యుండిరి. 'పడయాచి' యను జాతినామమును విచారింపఁగ నా తెగవారు యుద్ధభటులుగాఁ గుదిరియుండినట్లు తెలియుచుండెనపియు, 'పడై' యనఁగా సేనాసముదాయమునకు 'ఆచి'

యనఁ బరిపాలకుఁ డను నర్థ ముండెననియుఁ జెప్పఁబడుచుండెను. అటులనె 'కాణయాక్షి' యనఁగాఁ గన్ను మొసఁగని భూపతి యని యర్థ మిచ్చుచుండినట్లు నెల్సన్ దొరగారు దమ మధురజిల్లా మాన్యూలు (Madura Manual) రెండవ భాగము 57 వ పుటయందు వ్రాసిరి. 'కండరు' పదమునకుఁ బ్రభువు, అధికారి, శూరుఁడు, సూర్యవంశపురాజు నను నర్థములుండెనని డాక్టరు విన్స్లోదొరగారు ప్రకటించిన యరవ-ఇంగ్లీషు నిఘంటువునందు 235 వ పుటలోఁ (1862 సం॥ కూర్పు) గలదు. మిగిలినశబ్దములకు నిట్టి యర్థములే గలవు. ఇవి యన్ని ప్రభువుల బిరుదునామములై వారి రాచరికమును స్థిరపఱచుచున్నవి.

పల్లి శబ్దముగూడ రాజశబ్దమునకుఁ బర్యాయశబ్దముగ వ్యవహరింపఁబడుచుండినట్లు నిదర్శనములు గలవు. ప్రస్తుతమున బల్లీలని వ్యవహరింపఁబడుచున్నవారి వన్నియులనియు, వన్ని శబ్దము సంస్కృతమునఁ గల వహ్నిశబ్దమునకుఁ దద్భవమనియు డాక్టరు ఆపర్టు(Dr. Oppert) దొరగారు దమ హిందూ దేశపు పురాతననివాసుల చరిత్రయం దిట్లు చెప్పుచున్నారు.

* "ఈకాలములోఁ బల్లీలు పల్లెలయందు వ్యవసాయ

---

*. The Pallies at this moment on the whole a highly respectable class, living partly as agriculturists in the country and partly as citizens in towns. They belong to the caste

దారులుగను, బట్టణములందు నాగరికులుగను నివసించుచు ముత్తమునిమీఁద మిగుల మర్యాదగల జాతివారుగ నుండిరి. వారు వన్నియకులమువారు. 'వన్నియన్' అనుశబ్దము వహ్నియను సంస్కృతశబ్దభవము. రాజు లాగ్నేయచక్రధారులు గనుక వహ్నిదేవునకును రాజకీయోద్యోగమునకును సంబంధము గలదు."

ఇట్లు రాచరికపు గుర్తుగనుండిన వన్నిశబ్ద మొక బిరుదనామముగఁ బరిణమించి యేతన్నామధారు లగ్నికులులనియు, వహ్నికులులనియు, వన్నియులనియువ్యవహరింపఁబడుచుండెను. పల్లవశబ్దసాదృశ్యముచేత నేగాక తమ రాచరికమును గోలుపోయి పల్లెలందు నివసించుచుండుటచేతను బల్లీ లనియు వ్యవహరింపఁబడుచుండిరి. కావున రాజశబ్దమునకు మాఱు పల్లిశబ్దముగూడ నుపయోగింపఁ బడుచుండెను. ఎట్లన డాక్టరు ఆపర్టుదొరగారు దమ గ్రంథములో 128 వ పుటయం దిట్లు వ్రాసిరి:—

* "మళయాళమున రాజచిహ్నములతో సంబంధించిన

---

of the Vanniyars. The word Vanniyan is generally derived from the Sanscrit Vahni (fire). Agni the God of fire is connected with the regal office, as kings hold in their hands the fire-wheel of Agneya—Chakra.

* Everything connected with royalty has the term Palli prefixed to it in Malayalam as Pallikovil—a royal palace, Pallimetta—a royal bed, Palliaval—a royal-sword, Pallivetta—a royal chase &c. &c. &c.

ప్రతిమాటకు 'పల్లి' యను శబ్దముపసర్గగఁ జేర్పఁబడియున్నది. ఇందులకు దృష్టాంతరముగ రాజభవనములకు 'పళ్ళికోవిలగము' అనియు, రాజశయ్యకు 'పల్లిమెద్దై' యనియు, రాజఖడ్గమునకు 'పల్లివాల్' అనియు, రాజాఖేటము (రాజుల వేఁట) నకు 'పల్లివేట్టై' యనియు వ్యవహరింపఁబడుచుండెను."

ఇట్లు రాజోచిత బిరుదనామము లెన్నియో గలిగి యుండి యీపల్లవు లొకప్పుడు మహోన్నతరాజ్యరమాభిరాములై విరాజిల్లియుండినట్లు స్పష్టమగుచున్నది.

## —* సంబంధబాంధవ్యములు *—

చాళుక్యులకును బల్లవులకును సంబంధబాంధవ్యములు గలవు. బ్రహ్మదేవుని చులుకము (పుడిసిలి)నుండి యొకమహావీరుఁడు జన్మింపఁగా నీతనివంశమునకుఁ జాళుక్యనామము గలిగెనని చెప్పఁబడియుండెను. అట్లు జన్మించుటకుఁ గారణ మేమనఁగా, నొకకాలమున నింద్రుఁడు బ్రహ్మకడకరుదెంచి భూలోకమున నెవ్వరును యజ్ఞములఁ జేయక దేవతలకు హావిర్భాగంబు లొసంగకుండిరనియు నందుచేఁ బాపము విస్తరిలుచున్నదనియు విన్నవించుకొనఁగ బ్రహ్మదేవుఁడు ప్రసన్నుఁడై యర్ఘ్యమిడుకొఱకు నుదకమునకై పట్టియుండిన తన చుళుకమువంక

జూచెననియు నందుండి యొకవీరుఁ డుద్భవమయి చాళుక్యు లకు మూలపురుషుఁ డయ్యెననియు బిల్హణకవికృత విక్రమాంక దేవచరిత్రమున వర్ణింపఁబడియుండెను. ఈ చాళుక్యవంశము లోనివాఁ డగు విజయాదిత్యుఁడయోధ్యానగరమునుండి దక్షిణ దేశమునకు దండయాత్ర వెడలెను. ఆకాలమున నసక్రమపరాక్ర మముతో దక్షిణాపథమునఁ బాలించుచుండిన త్రిలోచనపల్లవ మహారాజు కాంచీపట్టణమును రాజధానిగఁ జేసికొని మహా వైభవముతో రాజ్యపాలన మొనర్చుచుఁ దన రాజధాని యగు కాంచీపురమును సువర్ణముతోఁ బ్రకాశింపఁజేయుచుండెను. వీని శౌర్యసాహసము లనుపమానములగుటచే దనమీఁదకు దండెత్తివచ్చిన చాళుక్యరాజగు విజయాదిత్యునితో ఘోర సంగ్రామము గావించెను. ఈ యుద్ధములో విజయలక్ష్మి విజ యాదిత్యునివరించినను విజయాదిత్యుఁడు రణనిహతుఁడయ్యెను.

అంత గర్భవతిగనుండిన వీనిభార్య ప్రస్తుతకడపమండల ములోఁ గల పెద్దముడియ మను నామాంతరము గల ముదివే మను నగ్రహారమున విష్ణుభట్టసోమయాజి యను బ్రాహ్మణు నింటకుఁ గొందఱనుచరులతోను, బురోహితునితోను దప్పించు కొనిపోయి యం దాసోమయాజివలనఁ గన్నబిడ్డవలెఁ బెంపఁ బడుచుఁ గాలముగడపుచుండెను. అంతఁ గొంతకాలమున కా సాధ్వి ప్రసవించి యొక మగశిశువును గాంచెను. వాని కాసోమ యాజి క్షత్రియోచితము లైన జాతకర్మాదిసంస్కారముల

గావించి వానికి విష్ణువర్ధనుఁ డను నామకరణము గావించెను. ఆబాలుఁడునుదినదినాభివృద్ధిగాంచుచు సకలశాస్త్రములందును, శస్త్రాస్త్రప్రయోగములందును మిక్కిలిసమర్థుఁడై శౌర్యధైర్యస్థైర్యాదిగుణసముదాయముచే మిక్కిలి ప్రసిద్ధుఁడగుచు నొకనాఁడు దనతల్లివలనఁ దన యుదంతంబు దెలిసికొని శౌర్యాతిరేకముచే విజృంభించి చాళుక్యపర్వతమునకుఁ బోయి యందు గౌరినిగుఱించి యఖండతపం బాచరించెను. అంత భక్తపరాధీన యగు గౌరి స్వప్నమున సాక్షాత్కరించి 'సైన్యము నుకూర్చికొనిపొమ్ము. నీకు విజయము లభింపఁగల' దని హెచ్చరించె నఁట. అంత విష్ణువర్ధనుఁ డుత్సాహవంతుఁడై సేనల సముకూర్చి తనతండ్రి గోలుపోయినరాజ్యమును మఱల సంపాదించుకొని కదంబులను, గాంగులను, రాష్ట్రకూటులను జయించి నర్మద మొదలు సేతువుదనుకఁగల యేడుకోట్ల యేబదిలక్షల గ్రామములు గలదేశము నంతయుఁ బరిపాలించె నఁట.

ఇట్లే విష్ణువర్ధనుని యపారవిజయములచేతనే యీతనికి విజయసింహుఁ డను బిరుదనామము గలిగెను. ఈ విష్ణువర్ధనజయసింహమహారాజు కాంచీపురాధీశ్వరుఁ డైన యొక పల్లవరాజకుమార్తెను బరిణయ మై యామెవలన నొక కుమారుని గాంచెను. ఆకుమారునకుఁ దనతండ్రిపేరయిన విజయాదిత్యుఁ డను నామకరణము గావించెను. ఈ విజయాదిత్యుఁడు రణరాగుఁడను బిరుదమును ధరించి విశేషకీర్తి గాంచెను.

ఇట్లు బలశౌర్య సంపన్నులయిన చాళుక్యులకును బల్లవులకును సంబంధబాంధవ్యములు గలవని తెలియుచున్నది. మఱియును బప్పాదేవుఁ డను బల్లవరాజు శివస్కందశాతకర్ణి యను నాంధ్రరాజుయొక్క పుత్రికను వివాహమయ్యెననియు నామిథునమునకు జనించిన శిశువున కాంధ్రాచారానుసరణముగఁ దాతయగు శివస్కందనామ ముంపఁబడెననియు, నీ శివస్కందుఁడే పల్లవరాజ్యస్థాపకుఁ డైనట్లును జరిత్రములు జెప్పుచున్నవి. ఇందుచే నీపల్లవులకు నాంధ్రదేశరాజ్యాధిపత్యము దండయాత్రలచే రాలేదనియు సంబంధబాంధవ్యములచే లభ్యమయ్యెననియుఁ జెప్పుదురు.

ఈవిధముగ నుత్తరహిందూస్థానము నుండి వచ్చిన పల్లవు లాంధ్రులతోడను, చాళుక్యులతోడను, దదితరభూపాలురతోడను సంబంధబాంధవ్యము లందుచుఁ గ్రమక్రమముగ రాజ్యపాలకులై తుదకపారరాజ్యవైభవోపేతులై ద్రవిడాంధ్రదేశముల కంతకును గొన్నిశతాబ్దములవఱకు నవిచ్ఛిన్నముగఁ బరిపాలకులుగ నుండినట్లు ముందుఁ జదువఁగలరు.

## —* పల్లవులలోని భేదములు *.

గాంగపల్లవులు :— ఇప్పటి మైసూరు రాజ్యములోఁ గల తలకాడును రాజధానిగఁ జేసికొని కొంతదేశము నొకతెగ

వారు పాలించుచుండిరి. ఈ దేశమునకు గంగవాడిదేశ మని పేరు. ఈ పాలకులు గాంగులనఁ బడిరి. పూర్వము బ్రహ్మ యొక్క నాలవతరమువానికి గంగాదేవియనుగ్రహమున నొక తనయుఁడు గలిగె ననియు నప్పటినుండి వాని వంశీకులు గాంగులనఁబడు చుండిరనియు వారి పురాణములందుఁ గలదు. ఈ గాంగులు కర్ణాటరాజ్యమును బాలించుచుండినప్పుడు కాంచీపురమును రాజధానిగఁ జేసికొని ద్రవిడదేశములోఁ గొంత భాగమును బల్లవులు పాలించుచుండిరి. ఈపల్లవులలో నొక శాఖ సమీపరాజులయిన గాంగులతో సంబంధములఁ గలిగించుకొనుచు 'తొండైనాడు'లో విశేషభాగమునుబరిపాలించుచు గాంగపల్లవులను సంజ్ఞ గలిగియుండిరి. ఈ గాంగపల్లవులు మిగుల విక్రమశాలురై గాంగులను, బాణరాజులను లోఁబఱచుకొని పరిపాలించుచుండిరి. ఈ బాణులు క్షత్రియవంశజుల మని చెప్పికొనువారితోఁబాటుగాక తాము రాక్షస సంతతి వార మనియు, దానశీలుఁడును దానవాగ్రేసరుఁడు నైన బలి చక్రవర్తి యొక్క కుమారుఁడగు బాణాసురుని వంశములోని వారమనియు చెప్పికొందురు. వీరు శైవమతావలంబకులని వేఱ చెప్ప నవసరములేదుగదా. వీరికిఁ దొలుత మైసూరు రాజ్యములోఁ గల కోలారుమండలములోని 'ఆవణ్యా'నగరమును, పిమ్మట నుత్తరార్కాడుమండలములోని తిరువళ్ళమును రాజధానులుగ నుండెను.

ఈ తామ్ర శాసనములని చెప్పఁబడిన కొన్ని శాసనములు 1903 వ సంవత్సరమున దొరికినవి. వానిలో 226, 228, 229 సంఖ్యలుగలవానిలోఁ బల్లవులును, గాంగపల్లవులును వీరికిఁ బ్రభువు లని చెప్పఁబడెను.

గాంగపల్లవులలో విజయదంతివిక్రమవర్మ మిగులఁ బరాక్రమముగలవాఁడయి పెక్కండ్రను దశమాండలిక సామంతులనుగఁ జేసికొనెను. మఱియు విజయనందివిక్రమవర్మ, విజయనృపతుంగవిక్రమవర్మ, విజయాపరాజితవిక్రమవర్మ యను వారలు మిగుల శూరాగ్రేసరులై విశేషరాజ్య మాక్రమించుకొని పాలించిన ట్లగపడుచున్నది. అపరాజితవిక్రమవర్మ కుంభకోణమునకు సమీపమునఁ గల శ్రీ పెరుంబీయమువద్ద వరగుణుఁడను పాండ్యరాజు నోడించెను. వీరి విపులచారిత్రమును ముందు జదువఁ గలరు.

నలంబవాడి పల్లవులు :— ఈపేరుగలవారు కొందఱు దా మీశ్వరాంశజుల మనియుఁ ద్రినయన పల్లవుని వంశములోనివార మనియుఁ జెప్పుకొనుచుందురు. పల్లవరాజ్యభాస్కరాస్తమయకాలమున ముప్పదిరెండువేల జనసంఖ్య గల నలంబవాడిరాజ్య మేర్పడెను. ఈ నలంబవాడిపల్లవరాజ్య మిప్పటి బళ్లారి మండలములోఁ గొంత భాగమును మైసూరునకు నుత్తరభాగమును నీశాన్యభాగమును జేరియుండెను. మహేంద్రాధిరాజ నలంబుఁడు బాణవంశము నిర్మూల మొనరించినట్లు

తెలియఁజేయు శాసన మొకటి సేలము జిల్లాలోని ధర్మపురి యందుఁ గనఁబడెను. వీరిచరిత్రమును గొంత రైసుదొరగారు దమ 'మైసూరుగజటీర్' అను గ్రంథమున వ్రాసియున్నారు. ఈ నలంబులకు బళ్లారిమండలములోని కంపిలియను పట్టణ మొకప్పుడు రాజధానిగ నుండెను. వీరు పదియవ శతాబ్దాంతము వఱకుఁ బాలించినట్లు తెలియుచున్నది.

ద్రావిడపల్లవులు:— గాంగపల్లవులు చోడరాజగు నాదిత్యునిచే జయింపఁబడిన పిమ్మట ద్రావిడ దేశములోని కొందఱు పల్లవులు దాము ద్రావిడపల్లవుల మని చెప్పుకొనుచుఁ జోడరాజులకడ నున్నతోద్యోగములను సంపాదించుకొనిరి. వీరిలోఁ గరుణాకరతొండైమాన్ అను ద్రావిడ పల్లవరాజు చెంగల్పట్టు మండలములోని వండలూరు అను సంస్థానమునకుఁ బ్రభువైయుండెను. ఇట్లె మఱికొందఱు ద్రావిడపల్లవు లందందుఁ గల సంస్థానముల కధిపతులుగ నుండుచు వచ్చిరి.

ఆంధ్ర పల్లవులు:— కాంచీపురమును రాజధానిగఁజేసికొని కొందఱు పల్లవులు పాలించుచుండ మఱికొంద ఱాంధ్ర దేశమున ధాన్యకటకమును (అమరావతి), వేంగిదేశమునఁ వేఁగిపురము (ఏలూరు సమీపమునఁగల పెదవేఁగి, చినవేఁగి యనునవి) రాజధానులుగఁ జేసికొని పాలించిరి. వీరిచరిత్రములను ముందు జదువఁగలము. ప్రస్తుత మాంధ్రదేశమున బల్లీలని పిలువఁబడుచున్నవా రెల్ల రీ యాంధ్ర పల్లవులకు సం

బంధించిన వారై యుండుటకుఁ గాంపున నగ్నికుల క్షత్రియులు, పల్లవరాజ వంశజులు నను నామములు వీనికి గౌరవవాచకములై యున్నవి.



## —* మతము *—



పల్లవరాజ్యస్థాపకుఁ డగు శివస్కందవర్మనామమును బట్టియుఁ గాంచీపురమునఁ గావింపఁడిన కైలాసనాథాది శివాలయ ప్రతిష్ఠాపనలచేతను వీరు ప్రప్రథమమున శివారాధకులైన శైవమతస్థులని తోఁచెడిని. తదుపరి జైన బౌద్ధమతములు మిక్కిలి వ్యాపించుచుండిన కతనఁ గొందఱు దన్మతవిధులను నలరి జైనమతాచారముల నవలంబించి తన్మతాభిమానము వహించినట్లును గనఁబడుచుండెను. ఎట్లనఁ బల్లవరాజపుత్రియగు కుందవై శ్రీపురమునకు నుత్తరమున నొక జైనదేవాలయమును గట్టించెను.

ఈ జైనమతము క్రీస్తుశకమునకుఁ బూర్వము 490 వ సంవత్సర ప్రాంతమునఁ బ్రారంభించెను. జైనమతస్థాపనాచార్యుఁ డని చెప్పఁబడు మహావీరుఁడు పాటలీపుత్రము (పాట్నా) నకు నిరువదియేడు మైళ్ల దూరమున నున్న వైశాలీనగరమున నతవంశమున జన్మించి తన ముప్పదియవ సంవత్సర ప్రాయమున పారసనాథు లను సన్యాసులతోఁ గలిసి కొన్నినూతన

విధులుగల యొక స్వతంత్రమతమును స్థాపించి పలు దేశములఁ బెక్కుమతములను బెక్కండ్రు శిష్యులను సంపాదించి పరమపద మందెను.

వీరి మతసిద్ధాంతము లేవి యన:—(1) వేదములు దైవదత్తములుగాక పొరపాటులతో నిండిన వైయున్నవి అనఁగా మానవరచితము లని భావము. (2) అర్హంతుఁడను సర్వేశ్వరుఁడు సర్వశక్తియుక్తుండు దయ్యను దయస్వరూపుఁడునై యున్నాఁడు. (3) మానవుల సుకృతదుష్కృతములతో వారిని శిక్షించుటకును రక్షించుటకును గారణభూతుఁడై యుండును (4) సృష్టి నాశనములను జెందఁజాలదు (5) ఈభూమికి దిగువ సప్తలోకములును పైనఁ జతుర్దశలోకములును గలవు. వానిలో దిగువలోకములు నరకలోకము లనియును మీఁదిలోకములు బ్రహ్మలోకము లనియుఁ జెప్పఁబడును. పైనఁ బను నేడవలోకమున బరమాత్మఁ డుండు ననియుఁ మానవుల పాపపుణ్యతారతమ్యములఁబట్టి, యాయా లోకముల కేఁగెదరనియుఁ జెప్పబడెను. (6) గురువులను, గడచిపోయిన తీర్థంకరులను బూజింపవలెను (7) అహింసయే పరమధర్మము ఇట్టి నిబంధనల నేర్పఱచి జైనమత బోధకులు పెక్కండ్రఁ దమ మతావలంబకులుగఁ జేసికొనిరి. పల్లవరాజులును గొంతవఱకీ మతమునం దభిమానమును జూపిరి. కాని, కాలక్రమమునఁ దన్మతమును విడిచిపెట్టి కుమారవిష్ణువు,

విష్ణుగోపవర్మ, సింహవిష్ణువు మున్నగు నామములచే వీరు వైష్ణవ మతావలంబకులై నట్లు తోఁచెడిని.

ప్రస్తుత కాలమున ద్రవిడాంధ్ర దేశములందు శైవ వైష్ణవ మతములు రెండును గలవు. 'శేరమాన్ పెరమాన్ నాయనారు' అను పల్లవరాజు శివభక్తాగ్రేసరుఁడును నత్యంత భక్తినిష్ఠాగరిష్ఠుఁడునునై శివసాయుజ్యము నొందఁగ వీని ప్రతిమలను శిలా విగ్రహములుగను లోహ విగ్రహములుగను జేయించి శివాలయములలో బ్రతిష్ఠించి, నేఁటి దనుక నాదలి భక్తులు పూజింపుచుందురు. ఇట్లే 'కులశేఖర పెరుమాళ్ళు' అను వైష్ణవభక్తుఁడు పదునిరువు రాళ్వారులలో నొకఁడగు పల్లవవంశజుఁడు. వీని విగ్రహమును గూడ విష్ణ్వాలయములలోఁ దద్వంశజులు ప్రతిష్ఠించి పూజింపు చుందురు.

ఇఁక రాఁబోవు ద్వితీయప్రకరణమునఁ బల్లవరాజ్య స్థాపనాచార్యుని యొక్కయుఁ దద్వంశజుల యొక్కయు వృత్తాంతమును వివరింపఁబడెడిని.



# ద్వితీయ ప్రకరణము



## బప్పాదేవుఁడు లేక వీరకూర్చ మహారాజు.



పల్లవులు చిరకాలము క్రిందటనె దక్షిణ హిందూస్థానమునఁ బ్రబల రాజ్యముల స్థాపించి నిర్వక్ర పరాక్రమమైన రాజ్య మేలఁ దొడఁగిరి. వీరిలోఁ బెక్కండ్రు పెక్కు దానములఁ గావించియు నందందుఁ దామ్రశిలాశాసనముల నెన్నింటినో యేర్పఱచియు నుండుటచేఁ జరిత్రకారులకుఁ దన్నామధేయాదులును, తత్కాలక్రమంబులును దెలిసికొనుట కవకాశము కలిగెను.

పల్లవరాజ్యస్థాపకులలోఁ బ్రప్రథమునిగ బప్పా*దేవుని నామము శాసనములందగఁబడుచున్నది. ఈబప్పాదేవు డాంధ్రరాజగు పులమాయియొక్క కుమారుఁడగు శివస్కందుని పుత్రికను బెండ్లాడెను. ఈమిథునమునకు జనించిన శిశువునకు నాంధ్రాచారానుసారముగఁ దాత పేరిడఁబడుటచే నీబాలుఁడు

* అప్పయనఁ, దండ్రియనియు నీశబ్దపర్యాయముగ "బప్పా" వాడఁబడె ననియు వీని నిజనామము వీరకూర్చమహారా జనియు శివస్కందవర్మను గుఱించి చదువునపుడు పాఠకులు దెలిసికొనఁగలరు.

శివస్కందుఁడను పేరఁబరగుచుండెను. పులమాయి కుమారుఁడయిన శివస్కందుఁడు క్రీ. శ. 177 మొదలు 184 వఱకుఁ బాలించిన ట్లుండుటచే నీ బప్పదేవుఁడును క్రీ. శ. 200 సంవత్సరప్రాంతమున నుండినట్లు నిశ్చయించిరి.

ప్రస్తుత గుంటూరుమండలములోని నర్సారావుపేటకుఁ బాడ్రెండుమైళ్ళదూరమున మైదవోలను గ్రామమున లభించినదియు 'విరిపర' గ్రామమునుగుఱించి వ్రాయఁబడినదియు నగు కొన్ని తామ్రశాసనములయందు — శివస్కందవర్మ యువమహారాజుగ నుండి తన తండ్రియొక్క పరిపాలనకాలమునందలి పదియవసంవత్సరమునఁ దమ రాజధానియగు గాంచీపట్నమునుండి ధాన్యకటకము (అమరావతి) నందుండిన తమ ప్రతినిధిచేత నాంధ్రరాష్ట్రములోఁ గల విరిపర గ్రామమును దానముచేసినట్లుగ ననుజ్ఞ యియ్యఁబడినట్లుండుఁ గలదు. దీనిని బట్టి చూడఁగఁ గాంచీపురము రాజధానిగఁ గల తొండైమండలముసేగాక యాంతకుము న్నాంధ్రులచేఁ బాలింపఁబడియున్న కృష్ణాతీరమువఱకుఁ గల దేశమునం దమరావతి రాజధానిగఁ గల యాంధ్రపథమంతయుఁ బాలించినట్లు తోఁచుచున్నది. ఈ యమరావతి క్రీస్తుశకము రెండవశతాబ్దమధ్యమున నాంధ్రులచేఁ బరిపాలింపఁబడుచుండిన దైనప్రసిద్ధశ్వేతశిలాస్తూపమును స్థాపించిన రెండవపులమాయికిఁ దరువాత నరఁగ ద్వితీయశతాబ్దాంతము (క్రీ॥ శ॥ 200) నఁ బల్లవరాజులకు స్వాధీనమయి

నట్లు గన్పట్టుచున్నది. అందువల్లనే మైదవోలు శాసనమునందు యువమహారాజ శివస్కందవర్మ విరిపరవిషయిక దానశాసనము ధాన్యకటకమునందుఁ గల తన ప్రతినిధికి వ్రాయఁ గలిగెను.

ఇంతియుగాక శాసనములవిధానమునుబట్టియు వీరి పరిపాలనకాలమును నిర్ధారణచేయవచ్చును. ఎట్లన :—క్షాత్రప రాజులయొక్కయు, గుప్తరాజులయొక్కయుఁ, జాళుక్య రాజులయొక్కయు శాసనము లన్నియు సంస్కృతభాషలో వ్రాయఁబడియుండఁగ క్రీస్తుశకము రెండవశతాబ్దములోఁ బరిపాలించిన యాంధ్రభృత్యవంశజు లగు గౌతమీపుత్ర శాతకర్ణి, పులమాయి, యజ్ఞశ్రీశాతకర్ణి, మాంఢారిపుత్రశకసేనుఁడు మున్నగువారి శాసనములం బోలె నించుకయైనను భేదము లేక వీరి (బప్పదేవుఁడు-శివస్కందవర్మ) శాసనము లుండుటంబట్టి వీరు రెండవశతాబ్దమున నుండినట్లు రివరెండు టి. ఫౌల్కుసుగారు నిర్ధారించిరి.

గుంటూరుమండలములోని తెనాలితాలూకాయందుఁ గల కొండమూడిగ్రామమునందు లభించిన శాసనములతో నీ మైదవోలుశాసనములు పోలియుండుటచేతను, నీకొండమూడి శాసనములు లిపియందును, భాషయందును గౌతమీపుత్రశాతకర్ణుని 'కార్లి' శాసనములను, వాసిష్ఠపుత్ర పులమాయియొక్క 'నాసిక' శాసనములను బోలియుండుటచేతను నీ మైదవోలు,

కొండమూడి, కార్లి, నాసిక శాసనము లన్నియు నొకకాలము నందే వ్రాయఁబడి యుండు నని యూహింపఁ దగి యున్నది. కావున రెండవశతాబ్దమధ్యమున ననఁగా 150 వ సంవత్సర ప్రాంతమున నమరావతీశిలాస్థూపస్థాపకుఁ డయిన పులమాయికిఁ బిమ్మట ననఁగా 200 సంవత్సర ప్రాంతమున నీ మైద వోలు శాసనము లిఖింపఁబడియుండు ననియు నప్పటికే యీ పల్లవరాజ్యము పాలేరునది మొదలు కృష్ణానదివరకు వ్యాపించి మిక్కిలి శక్తిమంతమును, కీర్తిమంతమును నై విరాజిల్లె నని నిశ్చ యింపఁ దగి యున్నది.



## —* శివస్కందవర్మ *—



శివస్కందవర్మ యువమహారాజుగ నుండినప్పుడు మైద వోలు శాసనము ప్రకటింపఁబడియుండె నని యింతకుఁబూర్వ ము చదివియుంటిరిగదా! ఈప్రభువు మహారాజుగ నుండినప్పుడు ప్రకటించిన మఱియొక శాసనము గలదు. అది హీరాహడగల్లి శాసనము. ఈ హీరాహడగల్లి (హార్పనహల్లి) బళ్లారిమండల ములోఁ గలదు. ఈశాసనము కంచి పురపాలకుఁడయిన శివ స్కందవర్మయొక్క పరిపాలనకాలములో నెనిమిదవసంవత్సర మున వ్రాయఁబడెను.

ఇందు శివస్కందవర్మ పల్లవవంశతిలకుఁడై మహారాజాధిరాజబిరుదముగలవాఁడనియు, భారద్వాజగోత్రుఁడనియుఁ గలదు. మఱియు నీ మహారాజగ్నిష్టోమ వాజపేయాశ్వమేధాది మహాక్రతువులఁ గావించినట్లు లిఖింపఁబడి యుండెను. కావున నాకాలమున నిట్టి క్షత్రియోచితక్రతువులఁ గావించిన నీ పల్లవులు క్షత్రియులుగనె పరిగణింపఁబడు చుండిరి.

—* వీని శాసనములు *—

మఱియు నీ శాసనమునందు వీని తండ్రియైన బప్ప మహారాజుచే దానము చేయఁబడిన చిల్లరేక కొడుంక యను గ్రామములోని యొక తోఁటను దిరిగి పేర్కొనుచు మఱి యొక నూర్పుడుక్కలను గొప్ప నివేశనస్థలములను [illegible] దానము చేసిన ట్లిందు వ్రాయఁబడి యుండెను. ఈ తోఁటవల్ల వచ్చు నాదాయమును ముప్పదినాలుగు భాగములుగఁ జేసి యొకటి మొదలు నాలుగు భాగములవఱకు నిరువదినాలుగు బ్రాహ్మణకుటుంబములకు దానము చేయఁబడినట్లు వ్రాయఁబడియుండెను. మఱియు నీ బప్ప మహారాజు కోటి (బంగారు నాణెములను) సువర్ణములను, పక్కి-పెద్దకోడి లక్షయరకలను దానము చేసిన ట్లిందుఁ గలదు. ఈ దానము తన వంశాభివృద్ధికై కావింపఁబడినట్లు పేర్కొనఁబడెను.

ఇట్టి మహాదాన మొసరించిన యీ బప్ప మహా

రాజును వీని పుత్త్రుఁడు శివస్కందవర్మయు మహారాజాధిరాజయి వాసి కెక్కి యుండె ననుట స్పష్టము. వీనిచేఁ బ్రతిష్ఠింపఁబడిన శాసనములు మైదవోలు, కొండముూడి (తెనాలి తాలూకాలోనిది) అమరావతి ప్రాంతములందు దొరుకుట చేత నీ శివస్కందవర్మ కాంచీపురము మొదలు గుంటూరు మండలము వఱకుఁ రాజ్యవిస్తారము గలిగి యుండె నని తెలియుచున్నది. ఈయన పరిపాలన కాలమున మంత్రులను, నాలోచన సభ్యులను జేర్చుకొని సామంతరాజులను వీర శిఖామణులతోను గొలువుదీరి తన రాజ్యమును విషయములు (Provinces) గను, నాడులు (Districts) గను విభజించి చేర్వేఱు పరిపాలకుల నియమించి తాను రాజాధిరాజయి పరిపాలించుచుండెడివాఁడు. వీని పాలనము మంచి కట్టుదిట్టములను, న్యాయశాసనములను గలిగి నిరంకుశముగ నుండెడిది. మఱియు నితఁడనేకాగ్రహారములను, మాన్యములను దానము చేసినట్లు వీని శాసనములు వేనోళ్లఁ జాటుచున్నవి.

ఇతఁడు గావించిన యాగముల చేతను, వీని వంశజులు 'వర్మాంతనామాపి నరేంద్రచిహ్నం' అనునట్లు రాజచిహ్నమయిన 'వర్మ' శబ్దమును గలిగియుండుట చేతను వీరి క్షత్రియత్వము స్థిరపడుచున్నది. ఆకాలమున వీని రాజధానీనగర మగు కాంచీపురము వేదాధ్యయనసంపన్నులయిన బ్రాహ్మ

ణోత్తముల చేతను, సంస్కృతభాషాపరిజ్ఞాతలగు బౌద్ధశాస్త్రముల చేతను విరాజిల్లుచుండెడిది. వీనిలో నాంధ్ర దక్షిణాపథములందుఁ బల్లవుల నూతనశక మారంభ మయ్యెను.

## —* కాలనిర్ణయము *—

వీని కాలనిర్ణయమును గుఱించి యిదివఱలోఁ గొంత ముచ్చటింపఁ బడియే యున్నది. వీనిచేఁ బ్రకటింపఁబడిన మైదవోలు, హిరాహడగల్లి శాసనము లాంధ్రభృత్య శాసనములం బోలియుండుటచే నీతఁడును నాకాలము వాఁడని తెల్సికొంటిమి. మఱియు సముద్రగుప్త మహాచక్రవర్తి యుత్తర హిందూస్థానమునుండి బైడివెడలి దక్షిణమునఁ బెక్కండ్రు రాజుల నోడించెను. తత్కాలమున దక్షిణకోసలమున మహేంద్రుని, మహాకాంతారమున వ్యాఘ్రరాజును జయించి కళింగదేశమునకు వచ్చెను. అందాక పర్వతము మీఁద నున్న కొత్తూరు దుర్గమును బాలించు దమనుని, దేవరాష్ట్రమును బాలించు కుబేరుని, అవముక్తాధీశ్వరుం డయిన నలరాజును, బిష్టపురము (పీఠాపురము) ను బాలించు మహేంద్రవర్మను, వేంగిని బాలించు హస్తివర్మను, పాలక్కడను బాలించు నుగ్రసేనుని, కుస్థలపురిని బాలించు ధనంజయుని, కాంచీపురాధీశ్వరుం డయిన విష్ణుగోపుని జయించిన „సముద్రగుప్తునిచే నలహాబాదునం దొక శిలాస్తంభముపైఁ

జెక్కింపఁబడిన శాసనమును బట్టి తెలియుచున్నది. ఈ శాసనము క్రీ॥ శ॥ 340 వ సంవత్సరము నందలిది. కావున క్రీ॥ శ॥ 349 వ సంవత్సరమున నున్న యీ విష్ణుగోపునకును శివస్కందవర్మకును మధ్య నేఁడుగురు బరిపాలించినట్లుండుటచే మొత్తముమీఁద నీ యేడుగురు బదునేను సంవత్సరముల కాలము చొప్పున రమారమి నొక శతాబ్దము పాలించియుందు రని యూహించినచో విష్ణుగోపునకు నొక శతాబ్దము వెనుక ననఁగా 240 వ సంవత్సర ప్రాంతమున శివస్కందవర్మ పాలించుచుండిన కాలమని తెలియుచున్నది. మఱియు నమరావతి యందు నాంధ్రరాజుల పరిపాలన కాల మంత్యదశకు వచ్చినది క్రీ॥ శ॥ 236 వ సంవత్సర ప్రాంతమే యగుటచేత నాంధ్రరాజుల యనంతరమున శివస్కందవర్మ మహారాజులు విరిపరగ్రామమును దానముచేసినట్లు మైదవోలు శాసనమును బ్రకటింపఁగలిగెను. కావునఁ బైకారణములఁబట్టి శివస్కందవర్మ క్రీ॥ శ॥ 240 వ సంవత్సర ప్రాంతమం దుండినట్లు తేలుచున్నది.

గుంటూరు మండలమునందు దొరికిన మఱియొక శాసనములో విజయస్కందవర్మ యొక్క ప్రభుత్వకాలమున భరద్వాజగోత్రుఁడును బల్లవరాజును నగు యువమహారాజ విజయబుద్ధవర్మయొక్క భార్యయు, బుద్ధ్యంకురవర్మ తల్లియు నగు

చారుదేవి దాలూరుగ్రామమున గల నారాయణస్వామి కోవెల కొకదాన మొసరించి నట్లు గలదు. ఈశాసనమును మైదవోలు హిరాహడగల్లి శాసనములునునొకేవిధముగఁ బ్రాకృతభాషలో లిఖింపఁబడిన నై కాంచీపురపరిపాలకులం గూర్చి చెప్పినవగు టచే నీ విజయస్కందవర్మ, యువమహారాజు విజయబుద్ధవర్మ యను రెండు నామములును శివస్కందవర్మవే యనియు, నీశివ స్కందవర్మభార్య చారుదేవి యనియు వీరిపుత్రుఁడు బుద్ధ్యంకుర వర్మయనియుఁ జెప్పుచున్నారు.

వీనిపిమ్మటఁ బెక్కండ్ర నామములుగల పెక్కు శాసనములు పలుతావులఁ గనుఁగొనఁ బడినవి. వీని యన్నిటిలోను విశేషసంఖ్యగలిగి చాలభాగము వంశక్రమముగఁ జేర్కొనఁబడిన దగు నొకశాసనము గలదు. అది వాయలూరు శాసనము. ఈ శాసనమును బట్టియు మఱికొన్ని శాసనములఁబట్టియు నీపల్లవరాజవంశమునఁ బెక్కండ్రనామములు సెప్పినపిమ్మట ప్రథమపరిపాలకునిగ వీరకూర్చుని జెప్పినపిమ్మటఁ బరిపాలకుల వంశవృక్షక్రమ మిట్లు గలదు.

వంశవృక్షము.

11 వీరకూర్చమహారాజు
ఇతడే బప్పాయనియుఁ బేర్కొనఁబడెను.
క్రీ॥ శ॥ 200.

12 యువమహారాజ శివస్కందవర్మ (లేక)
విజయస్కందవర్మ (క్రీ॥ శ॥ 240)

13 కుమార విష్ణు I

14 బుద్ధ వర్మ

15 స్కంధవర్మ

16 కుమారవిష్ణు II

17 బుద్ధవర్మ

18 స్కంధవర్మ

19 విష్ణుగోపవర్మ (338)

20 విష్ణుదాస (లేక) కుమారవిష్ణు (366)


21 స్కందవర్మ (394)
22. + 23. వీరవర్మ (422)
24 స్కందవర్మ (450)
25. సింహవర్మ (కంచి) 478
యువమహారాజ విష్ణు గోపవర్మ (478) గుంటూరుమండల ప్రతినిధి
26. స్కందవర్మ 506
29 సింహవర్మ 506
27. నందివర్మ I 534
30 విష్ణుగోపవర్మ 534 పాలక్కడు ప్రభువు.
28. సింహవర్మ
31 సింహవర్మ 562
32 సింహవిష్ణు 590
భీమవర్మ
33 మహేంద్రవర్మ I (618)
బుద్ధవర్మ
34 నరసింహవర్మ I (646)
ఆదిత్యవర్మ

35 మహేంద్రవర్మ II (660)
|
36 పరమేశ్వరవర్మ II (674)
|
రాజసింహుఁడు లేక
నరసింహావర్మ II (700)
|
పరమేశ్వరవర్మ II (715)

గోవిందవర్మ
|
హిరణ్యవర్మ
|
నందివర్మ II (717-69)
పల్లవమల్లుడు
|
దంతివర్మ (779-830)
|
నందివర్మ III (830-854)
|
నృపోత్తుంగవర్మ (854-880)
|
అపరాజితవర్మ (880-900)



## —*(19) విష్ణుగోపవర్మ.*—



ఇతఁడు కాంచీపురాధీశ్వరులలో నొకఁడయి కృష్ణానదీ తీరమువఱకుఁగల గొప్ప రాజ్య మేలుచు నుత్తరహిందూ దేశము నుండి వచ్చిన సముద్రగుప్తునితోఁ దలపడిన మహావీరుఁడు. ఆకాలమునఁ గొల్లేరు సరస్సు ప్రాంతమునఁ బరిపాలించు చున్న మంత రాజుయొక్కయుఁ బాలక్కడను బాలించు నుగ్రసేనుని

యొక్కయు వేంగీపుర పరిపాలకుని యొక్కయుఁ దదితర రాజుల యొక్కయు సాహాయ్యముచే సముద్రగుప్తుని వచ్చినదారిని వెనుకకు మరలింపఁ గలిగెను. వీనినిగుఱించి యింతకుఁ దప్ప మఱేమియుఁ దెలియదు.



## —* 24. స్కందవర్మ (వీని కుటుంబమువారు) *—



ఇతఁడు 'ఒంగోదు' (Omgodu No. I.) శాసనమును 'తాంబ్రప' నుండి ప్రకటించుటచే నీరాజు కంచి పరిపాలకుఁడుగా నట్లును వీని కుమారుఁడగు సింహావర్మ కంచి పరిపాలకుఁడై యుండి తన సోదరుఁడగు యువమహారాజ విష్ణుగోపవర్మను పాలక్కడ, దాసానపురము, మెన్మాతురము గలిగిన వేంగి రాష్ట్రము (ఏలూరు ప్రాంతము)నకును ముండరాష్ట్రము(గుంటూరుప్రాంతము)నకును కర్మరాష్ట్రము(ఒంగోలు ప్రాంతము) నకును పాలకునిగ నియమించినట్లును నొకానొక శాసనమునఁ దెలియుచున్నది. అందువల్లనే నీ విష్ణుగోపవర్మ, యువమహారాజవిష్ణుగోపవర్మ యని పేర్కొనఁబడెను.

ఈ యువమహారాజ విష్ణుగోపవర్మకుఁ బిమ్మట వీని కుమారుఁడగు (29) సింహావర్మ స్వతంత్రపరిపాలకుఁడయ్యెను. వీని కుమారుఁడును యువమహారాజవిష్ణుగోపుని మనుమఁడున

నగు (30) విష్ణుగోపుఁ డాంధ్రదేశమునఁ బ్రస్తుత నెల్లూరు గుంటూరుమండలములలోని పాలక్కడను బాలించుచుండఁగా యువ మహారాజవిష్ణుగోపుని సోదరకుటుంబమువా రనఁగా సింహవర్మపుత్రుఁడగు(26) స్కందవర్మయుఁ, పౌత్రుఁడగు (27) నందివర్మయును గాంచీపురము రాజధానిగఁగల ద్రవిడదేశమును బాలించుచుండిరి. ఈ విధముగఁ, బల్లవ పరిపాలనము ద్వివిధ రాజ్యములుగ నయ్యెను.



## —* (32) సింహవిష్ణు. *—



ఇతఁడు మిక్కిలి పరాక్రమవంతుఁడై పెక్కండ్రు భూపాలుర జయించినట్లు వీని చరిత్రము దెలుపుచున్నది. ఇతఁడు కావేరీజలముచే సస్యవంతముగఁ జేయఁబడి మిక్కిలి ఫలప్రదముగ నుండిన చోళుల రాజ్యము నాక్రమించుకొనెను. ఆ కాలమున దక్షిణదేశమున మిక్కిలి ప్రబలరాజ్యములు గలవు. వానిలోమలయము, కాలాభ్ర, మాళవ, చోళ, పాండ్య, సింహ కేరళ రాజ్యములను గూడ జయించినట్లు కాసకూడి శాసనములు దెల్పుచున్నవి.



## —* 33 మహేంద్రవర్మ I*—

ఆంధ్రదేశపాలకుడుగ నుండిన (30) విష్ణుగోపుడట్లు నెల్లూరు గుంటూరు మండలములఁ బాలించుచుండఁగ వీని పుత్రుఁడు (31) సింహవర్మ, పౌత్రుఁడు (32) సింహవిష్ణు, ప్రపౌత్రుఁడు (33) మహేంద్రవర్మ లాంధ్ర దేశమునందే పాలకులుగ నుండిరి. వీనిచేఁ గొండలయందుఁ దొలిపింపఁబడి కట్టింపఁబడిన పగు గుహాలయములందలి శాసనములలో "చెవిబుండంపు, నిర్వ్యోలోనయనంబు, వెంతులవిత్తు, పసరంబు" ఇత్యాది గృహనామములఁగలిగియుండుటచే నీమహేంద్రవర్మ యాంధ్ర రాజ్యపాలకుఁడనియే విశ్వసింప నవకాశము గలిగియున్నది.

వీనికాలములలోఁ బెక్కుకొండలఁ దొలిపించి చక్కని దేవాలయములను గట్టించెను. బెజవాడ, మొగల్ రాజపురము, సీతానివాసము (సీతానగరము), ఉండవల్లి మున్నగు తావులఁ జక్కనిదేవళంముల నిర్మింపఁజేసెను. ఈదేవళములు చోళ, చాళుక్య దేవళములఁ బోలియుండక పల్లవదేవాలయములతో ననేక సాదృశ్యములు గలిగియుంటచే నివి కృష్ణాతీర పరిపాలకు డైన మహేంద్రవర్మ నిర్మితములేయని నిర్ధారించిరి.

మహేంద్రవర్మ యేలూరు గుంటూరుల మధ్యప్రదేశ

మును పాలించుచుండుతఱి రెండవ పులకేశి వీనిపై దాడివెడ లఁగ నిం దుండి దక్షిణదేశమునకుఁ బోయి యుండుఁ బులకేశి దయిన పుల్లులూరును (చెంగల్పట్టు జిల్లాలోఁ గాంచీపురమునకు నుత్తరముగఁ బదునేను మైళ్లదూరమునఁ గలదు) స్వాధీన మొనరించుకొని యందే యుండి బెజవాడ ప్రాంతమునందు వలెనె కాంచీపుర ప్రాంతమునందును గొండగుహాలఁ దొలిపించి విచిత్రపద్ధతిని బెక్కుదేవళములఁ గావింపఁ జేసెను.

మహేంద్రవర్మ గొప్పకవియు, సంగీతకళారహస్యవేది యు నని మామన్డూరు శాసనములవలనఁ దెలియుచున్నది, ఇతఁడు సంస్కృతమున మతవిలాస ప్రహసన మను నుత్తమ గ్రంథమును రచించెను. అం దితఁడుపల్లవరాజుననియుఁ గాంచీ పురప్రభుఁడ ననియు సింహవిష్ణుని కుమారుఁడ ననియుఁ జెప్పు కొనెను. మఱియు "అవనిభాజన, మతవిలాస, గుణభార శత్రుమల్ల" మున్నగు నామములు గలిగినట్లు పేర్కొనఁబడెను. ఈ నామములను గృహనామము లనిరి గాని వాస్తవముగ నివి బిరుదనామము లై యుండవచ్చును. ఇతనికి సంగీత విద్యయందుఁ గూడ నేర్పుగలిగిన ట్లందుఁ జెప్పఁబడి యున్నది.

తిరుప్పరుత్తికున్రు (Tirupparuttikkunru) గ్రామము నందలి వర్ధమానాలయమున నొక్కగోడపైఁ గలశాసనమును

బట్టి యీ మహేంద్రవర్మ మామన్దూరుపరైకు సమీపమున మహేంద్రమంగలమను నొక గ్రామమును దనపేరిట గట్టించెనని తెలియుచున్నది. చిత్రమేఘసర స్సను పేర నొక గొప్ప తటాకమును గూడ మామండూరు వద్ద నెలకొల్పెను.

పుల్లలూరు దండయాత్రనుబట్టి గొప్పయుద్ధవీరుఁడనియు, శైవమతాభిమానియై పెక్కుదేవళముల నెలకొల్పుటచే గొప్ప మతాభిమాని యనియు, సంగీతసాహిత్యవిద్యలయం దసమాన వైదగ్ధ్యంబు గలిగి చిత్రకళానేది యగుటచే మంచి కళాకౌశలుం డనియు, కృష్ణా పాలేరు కావేరీ నదీతీరములందును శైలాంతర్భాగములందును విచిత్రరీతిని గొండలదొలిపించి యనేకదేవళముల నెలకొల్పుటచే నద్భుతశిల్పకళారహస్యజ్ఞుం డనియు మహేంద్రవాడి మామండూరు దలవానూరు పట్టణముల ప్రాంతముల గొప్పతటాకములనిర్మించి దేశమును సస్యవంతముగను బ్రజాక్షేమంకరముగను జేసిపాలించుటచే రాజకీయజ్ఞానధౌరంధేయుఁ డనియు స్పష్టమగు చున్నది.

ఈ విధముగఁ బ్రథమ మహేంద్రవర్మ పల్లవరాజవంశములో నొకక్రొత్తశకమును స్థాపించి సకలజనశ్రేయోదాయకముగఁ బాలించి కీర్తి గాంచెను.



## * 34 నరసింహవర్మ (642—660) *

వీని రాజ్యపరిపాలన కాలమునఁ జైనాదేశయాత్రికుఁడైన హ్యూనుత్సాంగు కాంచీపురమున నుండెను. కూరము శాసనములం బట్టి యీ క్రింది విషయములు దెలియుచున్నవి. కాంచీపురమునకు నిరువదిమైళ్ల దూరమున నుండినదియుఁ జెంగల్పట్టు జిల్లా సైదాపేట తాలూకాలోనిదియు నగు మణిమంగలము, పరియాల, సూరమార ప్రాంతములఁ జరిగిన యుద్ధములలో నరసింహవర్మ హర్షవర్ధను నంతవాని జయించి సాధించినట్టియుఁ దన స్నేహమునకై పర్షియాదేశచక్రవర్తిచేఁగూడ వాంఛింపఁబడినవాఁడును నగు జగత్ప్రసిద్ధ చాళుక్యచక్రవర్తియైన ద్వితీయ పులకేశిని వధించి, వాని రాజధాని యగు వాతాపి నగరమును నాశన మొనరించిన మహావీరుఁడీ నరసింహవర్మయని సింహళదేశచరిత్రయందును, తమిళపెరియ పురాణమునందును వర్ణింపఁబడి యున్నది. ఇట్లు చాళుక్యుల నణఁగఁద్రొక్కి నరసింహవర్మ దక్కనునకును మైసూరునకును మధ్యగల దేశమును నిరంకుశాధికారముగఁ బరిపాలించెను. ఇందుచే వీనికి మహామల్లుఁడనియు, వాతాపికొండ నరసింగపోతరాయుఁడనియు బిరుదులుగలవు. ఈ యుద్ధము క్రీ॥ శ॥ 642 వసం॥న జరిగె నందురు.

వాతాపి (బాదామి) నగరమున తన విజయమును సూచించుటకై యందొక జయస్తంభమును స్థాపించెను. ఈతని పేరిటనే, ప్రస్తుతమున మహాబలిపుర మనఁ బడునది యాకాలమున మహామల్లపుర మని వ్యవహరింపఁ బడుచుండెను. ఇతని విజయములచే వీనికి లభించిన మహామల్లుఁ డనుబిరుదమును బట్టి యాపురము మామల్లపుర మయ్యెను.

వాతాపి యుద్ధానంతరమున నరసింహవర్మ మఱియొక విజయమును గాంచెను. సింగాలీ రాజగు మనవమ్మ నరసింహవర్మ నాశ్రయింపఁగ వానికిఁ దోడుచూపువాఁ డయి దక్షిణ దిగ్విజయయాత్రకు బైలుదేరి చోళులను, కేరళులను, కాళాభ్రులను, పాండ్యులను జయించి సింహళమునకు దాడి వెడలెను. ఆ సమయమున మనవమ్మతో మామల్లపురము (మహాబలిపురము) వద్ద సముద్రమును నోడల సాహాయముచే దాటి సింహళమును ముట్టడించెను. ఈ యుద్ధమునందు సింహళాధీశుఁడైన హాతదత్తుని శిరచ్ఛేదము గావించిన మనవమ్మను సింహళ రాజ్యపట్టాభిషిక్తునిగనొనర్చిదిగ్విజయముతో నరసింహవర్మ తన రాజధాని కరుదెంచెను. ఈయుద్ధము క్రీ॥ శ॥ 660 వ సంవత్సర ప్రాంతమున జరిగియుండు నని నిశ్చయించిరి.

## —*మహేంద్రవర్మ II —(660—673.)*—



ఇతని గుఱించి చెప్పవలసిన దంతగా లేదు. వీని పరిపాలనకాల మంతయు శాంతియుతముగ జరిగెను. కాని తన శత్రువు లెల్లరును దలయెత్తకుండ మిక్కిలి నేర్పుగఁ బరిపాలించెను.



## —* పరమేశ్వరవర్మ I —(674—699.) *—

ఈ పరమేశ్వరవర్మ కాలమునఁ బశ్చిమచాళుక్యరాజును ద్వితీయ పులకేశివల్లభుని కుమారుఁడునునగు విక్రమాదిత్యుఁడు 655 వ సంవత్సర ప్రాంతమునఁ గొన్నిలక్షల సైన్యముతో దాడి వెడలి వచ్చెను. ఈయుద్ధము కాంచీపురప్రాంతముననే జరిగెను గాని యిం దుభయపక్షములును ధైర్యముతో నిలచి పోరాడినందున విజయ మెవరికిని లభించి యుండలేదు. అంతఁ బరమేశ్వరవర్మ మఱలఁ దిరుచునాపల్లికి 10 మైళ్లదూరమునఁ గల పెరువెలనల్లూరువద్దఁ దనశత్రు వగు బులకేశివల్లభుని డీకొని పరిపూర్తిగ నోడించెను.

కాంచీపురమునఁ గల కైలాసనాథుని దేవళముఃలోని

శాసనములందీ ప్రథమ పరమేశ్వరవర్మ యుగ్రదండుఁడనియు, లోకాదిత్యుఁడనియు బిరుదునామముల ధరించియుండెను. వీని శత్రు వగు విక్రమాదిత్యునకు రణరసికుఁ డను బిరుదుగలదు.

ఆకాలమున నీ పల్లవవంశజులు మామల్ల (మహామల్ల) వంశీకు లని పిలువఁబడుచుండిరి. ఈ పౌరుష నామము నరసింహ వర్మ నాఁటినుండి కలిగినదని చెప్పనక్కఱ లేదు గదా!

ఈ పరమేశ్వరవర్మయుఁ గొన్ని దేవళముల నిర్మింపఁ జేసినట్లు గన్పట్టును.



## —* నరసింహవర్మ II (700-714.) *—

ఈయనకు గృహనామముగ 'రాజసింహ' నామ మొసంగఁబడెను. ఇది బహుశః బిరుదనామమై యుండును. వీని పరిపాలనకాలము మిక్కిలి శాంతముగను దీర్ఘముగను జరిగెను. ఈయన రాజ్యకాలమంతయు శివారాధకులగు శైవులను భక్తిపురస్సరముగ సేవించుట యందును బెక్కు శివాలయముల స్థాపించుట యందును గడచెను.

ఇతఁడు కాంచీపురములోని కైలాస నాథాలయమున

ఐరావతేశ్వరాలయమును మహాబలిపురములోని తీరస్థదేవళమును పనామలై దేవళమును నిర్మింపఁజేసి లక్షలకొలఁది యేతద్దేవాలయముల కొఱకై వినియోగించి మిక్కిలి జనాదరమును గాంచి భక్తాగ్రేసరుఁడై విలసిల్లిన మహానీయుఁడు.

ఐరావతేశ్వరాలయము గృహముల మధ్యనుండి కాకేశ్వరాలయమున కెదురుగ నుండును. ఇందుఁ జాల శాసనములు దేవళము చుట్టును గలవు. కాని యవి మిక్కిలి శిథిలస్థితిలో నుండి చదువుటకు దుర్గ్రాహ్యముగ నున్నవి. ప్రవేశద్వారమునకుఁ కుడిభాగమున నొక శాసనమున 'నరసింహ' యనునామము స్పష్టముగఁ జెక్కఁబడి యున్నది. ఇంతకు మించిన విశేషము లేవియు నిందుఁ గానరావు.

---

## —*పరమేశ్వరవర్మ II —(715-717.*— .)

---

ఇతఁడు రాజసింహుఁడనియు నరసింహవర్మయనియుఁ బిలువఁబడు వాని తనయుఁడు. ఈయన కాంచీపురములోని వైకుంఠ పెరుమాళ్ల దేవళమును గట్టించెను.

తిరువాడి గ్రామమునఁ గల వీరధనేశ్వరాలయమును

పోలికయుండి వైకుంఠ పెరుమాళ్ళ కోవెలను బోలి యుండుట చేతను, నందలి యొక్క శాసనమున 'బరమేశ్వర పోతరాయర్' అని పేర్కొని యుండుట చేతను నీ దేవళమును గూడఁ బరమేశ్వరవర్మయే కట్టించి యుండునా యను సందియము గలుగుచున్నది గాని నిశ్చయింపఁ బడలేదు.

వీనికి బూర్వము వీని సోదరుఁడగు మూడవ మహేంద్రవర్మ కొంతకాలము పాలించెనని కొన్ని గ్రంథము లందుఁ గలదు.

---

## —* నందివర్మ పల్లవ మల్లుఁడు—(717 - 779.) *—

---

పరమేశ్వరవర్మకుఁ బిమ్మట రాజ్యాధిపత్యమునుగుఱించి కలహములు ప్రబలసాగెను. ప్రజానురాగుఁడును బల్లవవంశ భూషణుఁడును నగు నందివర్మపల్లవమల్లుని తండ్రియగు హిరణ్యవర్మ రాజ్యారోహణమునకుఁ బ్రబలప్రయత్న మొనరించెను. పల్లవరాజ వంశజుఁడయిన చిత్రమాయునితోను మఱికొందఱు పాండ్యరాజులతోను గొప్పయుద్ధము చేయవలసి వచ్చెను. ఈయుద్ధము మన్నైకుడిలోను, శంకర గ్రామములోను జరిగెను. ఈచిత్రమాయుఁడు పరమేశ్వరవర్మయొక్క పుత్రుఁడో

సమీపజ్ఞాతియై యుండును. కావున సింహాసనమున కై వీనికిని హిరణ్యవర్మకును పోరాటము తటస్థించెను. చిత్రమాయునకు సాహాయ్యము చేయవచ్చినవాఁడు రాజసింహ పాండ్యుఁడని తెలియుచున్నది.

శంకర గ్రామమునఁ గావింపఁబడిన యుద్ధమునందు హిరణ్యవర్మయొక్క సేనాధ్యక్షుఁడైన యుదయచంద్రుఁ డను వాఁడు చిత్రమాయుని చిత్రవధ చేసి తన ప్రభుపుత్రుఁ డైన నందివర్మ పల్లవమల్లుని సింహాసనాధిష్ఠితునిగఁ జేసెను.

సింహవిష్ణు (32) సంతతిలోని వాఁడయిన చిత్రమాయునకును సింహవిష్ణు సోదర సంతతిలోని వాఁడ నని చెప్పికొను హిరణ్యవర్మకును రాజ్యారోహణమును గుఱించి వివాదము సంభవ మయ్యెను. ఈ హిరణ్యవర్మకు రాజ్యమున మిక్కిలి పలుకుబడియు, శక్తి యుక్తులును గలిగి యుండెను. ఇతనికిఁ బెక్కండ్రు రాజకుటుంబములోని వీరులు ప్రోత్సాహకారులుగ నుండిరి. వీరిలో ముత్తరాయన్ (రాజు) అను వీరుఁడు తంజావూరున నొక ఘనతరోద్యోగిగ నుండెను. ఈయన పల్లవ పాండ్య రాజ్యముల సరిహద్దుల యం దుండిన పల్లవముఖ్యుఁడై యుండెను. రెండవ ముఖ్యుఁడు మన యుదయచంద్రుఁడు. ఇతఁడు కాంచీపురమునకు సమీపమునఁ గల వేగవతీ నదీ తీరమునఁ గల విల్లివాలమునకు సామంతరాజుగను హిరణ్య

వర్మకు ముఖ్యస్నేహితుఁడుగను నవసరమునుబట్టి కొన్ని వేళల సేనాధ్యక్షుఁడుగను నుండుచు వచ్చెను.

హిరణ్యవర్మ వీరల సాహాయ్యముచేఁ దన కుమారుఁ డగు నందివర్మ పల్లవమల్లుని సింహాసనాధిష్ఠితుని జేయుటయందు విజయము గాంచఁ గలిగెను. ఆ తరుణమున నందివర్మ యుక్త వయస్సు రానివాఁడుగ (మైనరుగ) నుండెను.

చిత్రమాయునకు సాహాయకులుగ వచ్చిన వారిలోఁ పాండ్యరాజగు రాజసింహుఁడును (వీనికి తేర్ మారన్ అను పేరును గలదు.) నీ రాజసింహుని మామ యగు మాళవాధీశుఁడును మఱికొందరును గలరు.

ఈ విధముగ హిరణ్యవర్మ స్వజాతీయు లైన పల్లవ రాజులతో నేగాక పాండ్యరాజులతోను యుద్ధములు చేయవలసి వచ్చెను. ఈ యుద్ధములు శంకరగ్రామము, మన్నైకుడి (మన్ని కురిచి లేక 'మన్ని' యందురు. ఇది తిరువిశాలూరు దగ్గఱఁ గలదు.) ఇదావి ( Idavai:— కుంభకోణము దగ్గఱ గలదు), గ్రామముల చెంత జరిగెను. ఇందు పాండ్యులు సింహాసన భ్రష్టులు గావింపఁబడిరి. మిగిలిన శాత్రవులు సఖ ముఖంబులకుఁ దరమఁ బడిరి. ఇట్లు తరమఁ బడినవారు పశ్చిమ చాళుక్యుల రాజ్యమునకుఁ బారిపోయి దాఁగిరి. అనికి ఆ కాలమునఁ జాళుక్య ప్రభువుగఁ ద్రుతీయ విష్ణువర్థన మహా రాజు పరిపాలించు చుండెను.

ఈవిధముగ నందివర్మ పల్లవమల్లుఁడు ప్రభుత్వాధికారంబు వహించి చిరకాలము రాజ్యమేలెను. వీని పరిపాలన కాలమునఁ జాళుక్యరా జగు ద్వితీయవిక్రమాదిత్యుఁ డపార సైన్యసమేతుఁ డయి తొండైమండలముపై దండెత్తివచ్చెను. తొండైమండలమునకు రాజధాని కాంచీపుర మని చదువరు లెఱింగియే యుందురు.

ఇట్లు దండెత్తి వచ్చిన విక్రమాదిత్యుఁడు పల్లవరా జగు నందిపోతవర్మను జయించి, వానిసంగీతసాధనము లైన "కటుముఖవాదిత్ర, సముద్రఘోష, ఖట్వాంగధ్వజ" అనువానిని, సుప్రసిద్ధములును శ్రేష్ఠతరములును నైన కొన్ని మత్తగజములను, దమ దేదీప్యమాన తేజోవిశేషముచే దిశల వెలిగించు రత్న సముదాయమును దీసికొనెను. కాని కాంచీపట్నమును మాత్ర మేమాత్రమును జెఱుపక రాజసింహేశ్వరాలయము (కైలాస నాథాలయము) నకు ననేక సహస్ర సువర్ణముద్రికల (నాణెములు) దానముచేసి, నరసింహపోతవర్మచేఁ గట్టింపఁబడిన తదితరదేవళములకును బెక్కు దానము లాచరించెను. అసహాయులను బీదసాదలను దన నిరుపమానవితరణముచేఁ బరితృప్తులఁ జేసెను.

ఈయుద్ధము క్రీ॥ శ॥ 741 వ సంవత్సరమున జరిగి నప్పటికిఁ బిమ్మటఁ జాలకాలము వఱకును నీ నందివర్మపల్లవ

మల్లుఁడు రాజరికము చేసి పెక్కు దానశాసనములఁ బ్రకటించి యుండినట్లు వీని శాసనములు పెక్కులు గనుఁగొనఁబడినవి. వానిలో వీని నలువదియేడవ పరిపాలన సంవత్సరమునఁ గావింపఁబడిన దానశాసనము విరించిపురమునందును, నేఁబదియవ సంవత్సరమునఁ గావింపఁబడిన శిలాదానశాసనము 'పంచపాండవమలై' యందును, నేఁబదిరెండవయేటఁ జేసిన శిలాదానశాసనము సాదుపులై యందును, నేఁబదియెనిమిదవయేట నొనరింపఁబడిన తామ్రశాసనము 'తొండన్‌తోత్తం' సమీపమునను, నలువదిరెండవయేటఁ గావింపఁబడిన శిలాశాసనము తిరువల్లము చెంతను గనుఁగొనఁబడెను.

యుద్ధానంతరమందును జాల కాలము ప్రజాపాలన మొనరించి దానశాసనములను నెలకొల్పుటనుబట్టి చూడఁగ విక్రమాదిత్యుఁడు కాంచీపట్టణమును స్వాధీనము చేసికొనక విజయమును మాత్రము ప్రకటించి మఱలెనని తోఁచుచున్నది.



## —* దంతివర్మ—(779 830.) *—

నందివర్మ పల్లవమల్లుని భార్యపేరు రేవాదేవి. తనవలె ధీరత్వముగల యొకయున్నతపర్వతమునం దుద్భవించి రేవానది మిక్కిలి గంభీరముగను మనోహరముగను బాఱుచుండినదగు

టచే నీనదియందలి గౌరవముచేతను భక్తిచేతను నీమె జనకుఁ డీమెకు 'రీవాదేవి' యని పేరిడెను. ఈ పెతండ్రి రాష్ట్రకూట వంశమునకుఁ జెందిదంతి యనుపేరఁ బరగెను. అందుచే నీరీవా దేవికిని నందివర్మపల్లవమల్లునకును జనించిన శిశువునకుఁ దల్లిచేఁ దనతండ్రి నామమగు దంతినామ మిడఁబడెను.

క్రీ. శ. 780 వ సంవత్సరమున సోదరులైన గోవింద ధ్రువులకు సమరము తటస్థింపఁగా మన దంతివర్మ ప్రథముడగు గోవిందునకు సహాయముగ వెళ్లినట్లును నందు ద్వితీయుడగు ధ్రువుఁడె జయమందినట్లును నొక శాసనమునఁ గ దీనినిబట్టిచూడఁగ దంతివర్మ పరిపాలనారంభకాల మింతకు ముం దనఁగ 779 వ సంవత్సరమే యని ధ్రువపడుచున్నది.

ఈ కాలమునందును బల్లవరాజులు కాంచీపురమునందే గాక కావేరీతీరముమీద నిప్పటి పుదుకోటసంస్థానము వఱకుఁ బాలించుచుండిరి. ఈవిషయము మీరాజుయొక్క పరిపాలనకాలములో నైదవయేటఁ బుదుకోటలోఁగల కున్నాన్దర్కోవెలకును, దిరుచునాపల్లి చెంతఁగల తిరువళ్ళాఱు నందును గావింపఁబడినదానములు స్థిరపఱచుచున్నవి.

వీని పరిపాలనకాలములో నాఱవ సంవత్సరమున గింజి సమీపమునఁగల తొండూరునందును, ఏడు, తొమ్మిది, పది

సంవత్సరములందు చెంగల్పట్టుజిల్లా యందలి యుత్తర మల్లూరునందును గొన్ని వీనిపేరిటి దాన శాసనములు గనఁబడుచున్నవి.

కంచిసమీపమునఁ గల కూరమునందును జెన్నపురిలోని తిరువలిక్కేణి యందును లభించిన వీని శాసనములు వీని పరిపాలనము యొక్క పంద్రెండవ సంవత్సరమునాఁటివి యని తెల్పుచున్నవి.

మలైయాధిపతి శాసనములలో రెంటియందు విడేల్ విడుగు ముత్తరాయన్ (Videlvidugu Muttarayan) అన నతఁడు దాను దంతివర్మకు సామంతరాజు (a vassal) నని చెప్పికొనుటచే దంతివర్మ తన పదియాఱవయేట ముత్తరాయర్ రాజధానికిని ప్రభువుగ నుండినట్లు స్పష్టము.

వీని పరిపాలనయొక్క యిరువదియొకటవ సంవత్సరమును నుత్తరమల్లూరుశాసనము పేర్కొనుచున్నది. ఈ కాలము క్రీ॥శ॥ 800 అయి యుండును.

ఈకాలములోనె మూడవగోవిందుఁ డనువాఁడు దాడి వెడలి కంచిపురపాలకుఁ డైన యీ దంతివర్మను గప్పము గట్టునట్లు చేసెను. దీనినిబట్టి మన పల్లవరాజుల ప్రతాపాగ్ని

చల్లఁబడుచుండె ననుటకు నిదర్శనముగ నున్నది. మఱియు క్రీ॥శ॥ 800 మొదలు 828 వ సంవత్సరము వఱకు ననఁగా వీని పాలనము యొక్క యిరువది యొకటవ సంవత్సరము మొదలు నలువదితొమ్మిదవ సంవత్సరము వఱకును నెట్టిదాన శాసనములును గానరా కుండుటయు నిందులకు నిదర్శనముగ నున్నది.

అయినను వీని పరిపాలనమునందలి నలువది తొమ్మి దవ సంవత్సరము నాఁటిదియు, నేఁబదియొకటవ సంవత్సరము నాఁటిదియు నగు రెండు శాసనములు మాత్రము గనఁ బడు చున్నవి. వానిలో నొకటి గుడిమల్లమునకుఁ జేయఁ బడిన దానమును, రెండవది తిరుచానూరు నందలి శాసన మును నై యున్నవి.

దక్షిణభాగమునం దనఁగా ముఖ్యముగాఁ దంజావూరు తిరుచునాపల్లి మండలములం దీ దంతివర్మయొక్క చరమ దశయం దొక్క శాసన మైనను గానరా కుండెను. మఱియు 795 మొదలు 830 వఱకుఁ గల యీ ముప్పదియైదు సంవ త్సరముల కాలమునం దెన్నడును గావేరీతీర మందలి యే శాసనము లందును వీనిపేరు గానరా కుండెను. ఇందు లకుఁ గారణ మేమి? విచారింపఁగాఁ బల్లవరాజ్యముయొక్క దక్షిణభాగ మంతయుఁ బాండ్యరా జగు మారన్ జటయన్

(Maran Jadaiyan—వరగుణ పాండ్యునియొక్క మాఱియొక
నామమై యుండును) వల్ల నాక్రమింపఁబడెనని తెలియు
చున్నది. ఈ వరగుణుఁడు చోళరాజ్యమును బల్లవరాజ్య
మయిన తొండైనాడును దన మధురరాజ్యమునకు గలిపికొనె
నని హాలాస్య మహాత్మ్యమువల్లను తిరువిళై యాడల్ పురా
ణము వల్లను దెలియుచున్నది.

దంతివర్మకుఁ బిమ్మట రాజ్యపాలకు లైన నందివర్మ
యొక్కయు, నృపోత్తుంగవర్మయొక్కయుఁ బెక్కు శాసన
ములు తంజావూరు, తిరుచునాపల్లి మండలములో ననేక
గ్రామములందు లభించుటచే నీ వరగుణునియొక్క విజయము
దంతివర్మకుఁ బిమ్మటఁ గాక దంతివర్మయొక్క కాలమునందె
జరిగియుండెనని విశ్వసించుట కాధారము గలిగి యుండెను.

ఈ యాక్రమణము దంతివర్మయొక్క రాజ్యకాలము
నం దనఁగా క్రీ॥ శ॥ 825 వ సంవత్సర ప్రాంతమున జరిగి
యుండెనని చరిత్రకారులు నిశ్చయించిరి. ఈ కాలమె పాండ్యరా
జగు వరగుణుని పరిపాలన సమయ మగుటచే పైన
చెప్పఁబడిన 'మారన్ జదయన్' అను నతఁడు వరగుణుఁ
డెగాని యన్యుఁడుగాఁడని నిర్ధారింపవచ్చును.

ఈ విధముగఁ బల్లవరాజ్యములోని చాలభాగమును
పాండ్యరాజగు వరగుణుఁ డాక్రమించుకొని కాంచీపురమును

గూడఁ గబళింపఁబ్రయత్నములను సలుపుచుండెను. ఇంతలో దంతివర్మ మహారాజుయొక్క యవసానకాలము సంప్రాప్త మయ్యెను.



## —* నందివర్మ (830—854) *—



దంతివర్మ కదంబరాజపుత్రికయైన అగ్గలానిమ్మ యను నామెను బెండ్లాడెను. ఈ దంపతులకు జనించినవాఁడే మన ప్రస్తుత కథానాయకుఁ డగు నందివర్మ. ఇతఁడు తన తండ్రియొక్క సింహాసనమునకై కొంత పోరాడవలసి వచ్చెను. (ఈ విషయము వేలూరుపాలెము శాసనముల నుండి గ్రహింపఁబడినది) తిలాస్థానము శాసనములును వీని యుద్ధములను వర్ణించుచున్నవి.

ఇంతకుముందు క్షీణదశనంది మిగుల వగలఁ బొగులు చున్న పల్లవ రాజ్యలక్ష్మిని దన భుజబల పరాక్రమముచే మఱల నందివర్మ యున్నతస్థితికిఁ దీసికొనివచ్చి యలరింపఁ దొడంగెను. ఇతఁడు పితరులవలెఁ గాక తన శాత్రవుల యుద్ధ భూమికి బలిపెట్టుచు దన పరిపాలనారంభమునుండి పది వత్సరములవఱకును నెడతెగని పోరాటములఁ గావించి విజ

యుఁ డగు చుండెను. ఇతడు గావించిన తెల్లారు (Tellaru) యుద్ధమును గుఱించి తిలాస్థాన శాసనము పేర్కొనుచున్నది.

ఉత్తరార్కాటు మండలములోని వందవాసి తాలూకా యం దొక భాగమైన తెలారుపట్టు అను దానికి తెలారు రాజధానిగ నుండెను. ఇది కంచికి ముప్పదిమైళ్ల దూరమునఁ గలదు. ఇందుఁ బల్లవులచేఁ బెక్కు దేవళములు నెలకొల్పఁబడి యుండెను.

వరగుణ పాండ్యరాజు దంతివర్మ కాలమున నాక్రమించుకొనిన రాజ్యమునుగాక మిగిలిన పల్లవరాజ్య మంతయు నాక్రమించుకొనఁ బ్రబల ప్రయత్నములు సల్పుచుండుటను జదువరు లెఱిఁగియె యుందురు. అట్లు విశేషసైన్యమును గూర్చుకొని కంచిపైకి దాడి వెడలుచుండెను. అంత నందివర్మ తెలారువద్దఁ దన శత్రువును దాకి యుండును. కుంభకోణము చెంతఁ గల పలియారునందును బరాజితుని జేసి వైగై (Vaigai) నదీతీరము వఱకును దఱుమఁ గొట్టెను. 'నందికలంబగము' అను గ్రంథమున 31వ పద్యమం దీ విషయము వర్ణింపఁబడెను.

ఈ విజయములచే నందివర్మ 'తెలరేరింద' అను బిరుదాంచితుఁడై కంచియందేగాక కావేరీతీరమువఱకును మిక్కిలి శాంతియుతముగ రాజ్యపాలన మొనరింపఁ గలిగెను.

వీని దానశాసనములు తంజావూరు తిరుచునాపల్లిమండలములలోఁ గల తిలాస్థానము, సెందల (Sendalai) కోవిలాడి, తిరువలత్తూరు, అను గ్రామములందు వీని పరిపాలనారంభమునుండి వరుసఁగా 10, 12, 18, 22 వ సంవత్సరములలోఁ గావింపఁబడిన శాసనములు దొరికినవి. వీనిఁ బట్టిచూడ నీ నందివర్మ మిక్కిలి పరాక్రమముతోఁ జిరకాలము పాలించె నని స్పష్ట మగు చున్నది.

ఇతఁడు కవితాప్రియుఁడై పెక్కుగ్రంథములను దాను రచించియు,విశేషౌదార్యము సూపి సుకవులచే రచింపఁజేసియుఁ గీర్తి గాంచెను. వీని కీర్తిచిహ్నమగు గ్రంథములలో నందికలంబగమను గ్రంథమొకటి. పెరుందేవనారను కవి 'భారతవెంబ' యను నొక తమిళ్గ్రంథమును వీని యంకితమున రచించియుం దీరాజుయొక్క తిలారువిజయములను వర్ణించి యుండెను. ఈ కవిచే నింకను మఱికొన్ని తమిళ్గ్రంథములు రచింపఁబడె నఁట.

ఇట్లీనందివర్మ తన తండ్రిచేఁ గోల్పోవఁబడిన రాజ్యభాగమును సంపాదించి కవియు గవిపోషకుఁడు నై కీర్తి గాంచి మించెను.

ఇతఁడు రాష్ట్రకూటరాజపుత్రిక యగు శంఖాదేవిని బరిణయమయ్యెను. ఈమె యమోఘవర్షుని తనయ. ఈ యమోఘవర్షుఁడు క్రీ॥ శ॥ 815 మొదలు 879 వఱకుఁ బాలించెను. ఈశంఖాదేవివలన నందివర్మ నృపోత్తుంగు డను సుతుని బడసి వాని చిఱుతప్రాయమునందే పరమపద మందెను.



## —* నృపోత్తుంగవర్మ మహారాజు (854—880.) *—



నృపోత్తుంగుఁడు దన చిఱుతప్రాయమునందే విశేషకీర్తి గాంచి మించెనని బాహూరుశాసనములవలనఁ దెలియుచున్నది. ఇతఁడు రాజ్యారూఢుఁడైన వెంటనే యరిసిలేరు (Arichit or Arasilayaru) నదీతీరమునఁ గల పాండ్యరాజులపై దాడి వెడలి విజయుఁ డయ్యెను. ఈ నది కుంభకోణము సమీపమునఁ దూర్పుగాఁ బ్రవహించి కరికాల్ గ్రామము చెంత సముద్రములోఁ గలియుచున్నది. ఈ యుద్ధము మారవర్మ పరచక్రకోలాహలునితో జరిగినట్లు చెప్పఁబడుచున్నది

ఈ నృపోత్తుంగమహారాజుయొక్క యశశ్చంద్రికలను ముప్పదిరెండు సంస్కృతశ్లోకములలో మిక్కిలి మనోహరముగ బాహూరు శాసనములు వర్ణించుచున్నవి.

ఇతఁడు మిక్కిలి పరాక్రమవంతుఁడును సుప్రసిద్ధుఁడును మహోదారవంతుఁడును నై యనేకదానశాసనములను పల్లవ రాజ్యమందంతటను నన(గా నుత్తరమున( దిరువలంగాడు, తిరువ్వైరియూర్ మొదలు దక్షిణమున కడియూర్, కోవిలాడి, లాల్గుడి వఱకును, మఱియు గుడిమల్లము, నార్థమలై గ్రామములయందును బ్రకటించినట్లు కన(బడుచున్నది. ఈ శాసనములందుత్తరమున బాణవంశరాజగు విద్యాధరుండును దక్షిణమున ముత్తరాయన్ రాజును దనకు సామంతులుగ నుండినట్లు గలదు.

ఈవిధముగ నృపోత్తుంగుని రాజ్యము స్వర్ణముఖీనది మొదలు దక్షిణము వేలూరువఱకు నన(గా( గాళహస్తి మొదలు పుదుకోటసంస్థానము వఱకు వ్యాపించియుండెను. ఇతని పరిపాలనారంభము మొదలంత్యదశవఱకుఁ గల యిరువదియారు సంవత్సరములును వీనిదానశాసనములు విరాజిల్లుచు నకుంఠితకీర్తివైభవముతో వీని జీవితము గడచినట్లు వీని శాసనములే వేనోళ్లఁ జాటుచున్నవి.

---

## —* అపరాజితవర్మ (880—900) *—

అపరాజితవర్మ నృపోత్తుంగుని కుమారుఁడే యని కొందరును బల్లవవంశమునకుఁ జెందిన యొకానొక పురుషుఁ డని మఱికొందఱును జెప్పుదురు; కాని నృపోత్తుంగుని కుమారుఁడే యని వి. వెంకయ్యగా రూహించి యుండిరి. (G. O. No. 492, 2nd July 1916, part II, No. 9, page 64)

నృపోత్తుంగుఁడు శ్రీ పెరుంబియము నందు జరిగిన యుద్ధములో మరణింపఁగ వీనికుమారుఁ డయిన యపరాజితవర్మ వెంటనే సింహాసనాసీనుఁ డయ్యెను.

ఇతఁ డాయుద్ధములోఁ దంజావూరు తిరుచునాపల్లి పరగణాలను జోళరాజులకు వదలిపెట్టి తనరాజ్యమగు తొండైమండలమును బ్రవేశించి యం దవిచ్ఛిన్నముగ నిరువదేండ్లు పాలించెను. ఈ కారణముచేతనే వీని శాసనము లన్నియుఁ దమిళదేశములోని యుత్తరభాగమందలివియగు మంగాడు, తిరువొఱ్ఱియూరు, సత్యవేడు, తిరుత్తాని, ఉత్తరమల్లూరు, మున్నగు గ్రామములందె కనుఁగొనఁబడినవి; కాని, తంజావూరు తిరుచునాపల్లి పరగణాలయం దొక్కటియైనఁ గానరాకుండెను.

తిరువ్వొరియూరునందు దొరికిన రెండుశాసనముల యందు 'ప్రోతరాయన్' అను బిరుదనామము వీనిపేరునకు ముందుఁ జేర్చఁబడియున్నది. వీని పరిపాలనముయొక్క మూఁడవ సంవత్సరము మొదలు పందొమ్మిదవ సంవత్సరము వఱకుఁ బదునొకండు శాసనములు గనుంగొనఁబడినవి. అవి యీక్రిందఁ జేర్పఁబడెను—

| | | | | |
|---|---|---|---|---|
| 3 | సం॥న | నెం. | 351/1908 | మంగాడు |
| 4 | ,, | ,, | 158/1912 | తిరువ్వొరియూరు |
| 4 | ,, | ,, | 161/ ,, | ,, |
| 4 | ,, | ,, | 31/ ,, | సత్యవేడు |
| 5 | ,, | ,, | 3[illegible]/ ,, | ,, |
| 6 | ,, | ,, | 190/ ,, | తిరువొరియూరు |
| 7 | ,, | ,, | 163/ ,, | ,, |
| 9 | ,, | ,, | 159/ ,, | ,, |
| 12 | ,, | ,, | 180/ ,, | ,, |
| 18 | ,, | ,, | 435/1905 | తిరుత్తాని |
| 18 | ,, | ,, | 433/ ,, | ,, |

ఇట్లు పెక్కు దానశాసనముల వెలయించి, వితరణ ఖనియై యాచంద్రార్క యశోవిరాజితుఁ డయ్యెను. వీని పందొమ్మిదవ పరిపాలన సంవత్సరమును దెలియఁజేయుచుఁ ద్రిభువనవీరదేవుని కాలమునఁ బ్రకటింపఁబడిన యొక శాసనము త్తరమల్లూరువద్దఁ గనుఁగొనఁబడెను.

మామండూరు చెంతఁగల 'ఉక్కమ్' అను గ్రామ మీనృపాలుని పేరు దాల్చి 'అపరాజిత చతుర్వేదిమంగల' మను పేరఁ బరగుచున్నది. (S. I. I. Vol. III, Page 2) ఇందుల కీయపరాజితవర్మ యీ గ్రామమును దగురీతి సంస్కరించి దానము చేసియుండవచ్చును.

తిరుపిరంబీయ మనఁబడు శ్రీపెరుంబీయముకడ వరగుణపాండ్యరాజు మన యపరాజితవర్మతోడను వీని స్నేహితుఁడగు బశ్చిమగంగపృథ్వీపతితోడను బోరాడి కడపటి వానిని బానిసగఁ దీసికొని పోయె నని యుదయేంద్రము శాసనములు నుడువుచున్నవి. ఈ పృథ్వీపతియొక్క కడపటిశాసన మొండు క్రీ॥ శ॥ 879 వ సంవత్సరము నాఁటిదై యుండుట చేత నీయుద్ధ మీ సంవత్సరమునకుఁ బిమ్మట జరిగియుండునని యూహ్యము.

ఆ కాలమునఁ బాండ్యరాజులును జోళరాజులును మిత్రభావమున నుండిరి. గనుక వరగుణపాండ్యరాజు దన మిత్రులగు జోళరాజుల సాహాయముచే దమ కత్యంతశత్రువుగ నుండిన పశ్చిమగంగ పృథ్వీపతి నట్లు సాధించిరి. పిమ్మట మఱికొంతకాలమున కనఁగఁ దొమ్మిదవ శతాబ్దాంతమునఁ (900) జోళరాజైన యాదిత్య చోళమహారాజు (ప్రథముఁడు) చేరరాజగు స్థానురవి యనువాని సాహాయము దీసికొని యపరాజితవర్మపై దాడివెడలి వానిని బరాజితుని జేసి వాని రాజ్యము సర్వస్వమును నాక్రమించుకొనెనని యొక శాసనము (తిరువాలంగాడు శాసనము) దెలుపుచున్నది.

ఆదిత్యచోళుఁడు దన పాలనముయొక్క యిరువది యొకటవ యేట ననఁగా క్రీ॥ శ॥ 900వ సంవత్సరమునకు బూర్వమునఁ దొండైమండలము నాక్రమించుకొని యుండె (G. O. No. 503, 27th July 1907—Part II, No. 29, Page 71.) నని చెప్పఁబడియెఁ గాన నపరాజితవర్మ క్రీ॥ శ॥ 900వ సంవత్సరమువఱకు నుండెననుట స్పష్టము.

ఇట్లు క్రీస్తుశకము 200వ సం॥ మొదలు 900 సం॥ వఱకు ననఁగా నేడువందల సంవత్సరములు ద్రవిడాంధ్ర దేశముల నిర్వక్ర పరాక్రమంబుగాఁ బాలింపఁబడు చుండిన పల్లవరాజ్య భాస్కరుఁ డపరాజితవర్మతోఁ బాటస్తమింపఁ

జొచ్చెను. నలువైపులనుండియు దసముచుండి చోళ, చాళుక్య, పాండ్య రాష్ట్రాధీశులకు మన పల్లవరాజులు వశ్యులు కావలసి వచ్చెను. అయినను నింతటితోఁ బల్లవ రాజ్యవైభవ మంతరించినదని చెప్పనొప్పదు. ఏలయన ద్రవిడాంధ్రకర్ణాట రాజ్యములం దింకను నందందు స్వల్పభాగములకు స్వతంత్రులుగనో, సామంతులుగనో యుండి తమ భూభాగములను బదునేడవ శతాబ్దమువఱకును బాలించుకొనుచునే యుండిరి. ఈ విషయమునుగుఱించి చెప్పుటకు ముందించుక సింహావలోకనము గావించి యుందము. ఇంకను మఱికొన్ని శాసనములందుఁ బేర్కొనఁబడిన మఱికొందఱు పల్లవరాజులగుఱించి రాఁబోవు ప్రకరణమున ముచ్చటించుదము.



# తృతీయ ప్రకరణము

## జయవర్మ

తెనాలితాలూకాలోని కొండముది గ్రామమునందొక తామ్రశాసనము గనుఁగొనఁబడెను. అది కూడూహారవిషయాధిపతియైన జయవర్మపేరిట లిఖింపఁబడెను. రాజముద్రికయందు జయవర్మమహారాజని పేర్కొనఁబడెను. ఈశాసనములోని లిపియు శివస్కందవర్మయొక్క శాసనములోని లిపియు నొకమాదిరిగనె యుండినవి. ఇదియును ప్రాకృతభాషలోనె లిఖింపఁబడి 'మహేశ్వర, బృహత్పలాయన' యను శబ్దములు మాత్రము సంస్కృతభాషలో నుండెను.

కూడూహారవిషయములోని పంతూరను గ్రామమును నెనమండుగురు బ్రాహ్మణులకు దానముచేసియుండినట్లు కూడూరులో నుండిన తన ప్రతినిధి కాజ్ఞయొసంగినట్లిందుఁ గలదు. కూడూహారరాష్ట్రమునకు నీకూడూరు రాజధానిగ నుండెను. కూడూరు బందరు దగ్గఱఁగల గూడూరో, పెడనదగ్గఱఁగల కూడూరో యై యుండును. కూడూరు రాజధానిగ నుండిన ప్రదేశమునకుఁ గూడూహారరాష్ట్రమని పేరు గలదు; కాని

పిమ్మట వేఁగి రాజధానియైనప్పుడు వేంగిరాష్ట్ర మను పేరు వచ్చెను. కావున తొలుదొల్తఁ గూడూరాహార రాష్ట్ర మనియుఁ బిమ్మట వేంగిరాష్ట్ర మనియు వ్యవహరింపఁబడుచున్న యీ దేశమునకుఁ బల్లవు లొకప్పుడు పరిపాలకులుగ నుండిరని యీ శాసనములె చాటుచున్నవి. కృష్ణాజిల్లాలోని యేలూరు సమీపమున దక్షిణవల్లూరుజమీనాలోని వగు పెదవేఁగి, చినవేఁగి యను గ్రామములు కలిసి పూర్వము వేఁగిరాష్ట్రమునకు రాజధానిగ నుండినట్లు తెలియుచున్నది.

వేంగి యనఁగ నఱవములోఁ బెద్దపులియను నర్థము గుటచే శాత్రవులకు భీతిని గొల్పఁగల దను నర్థ మిచ్చునటుల దను రాజధానికి 'వేఁగి' యని పేరిడినటులఁ జెప్పఁబడును. ఇట్టి యభిప్రాయముతోనే యిచ్చినట్టులఁ బ్రస్తుత బొబ్బిలిసంస్థానమునకుఁ బూర్వము బెబ్బులి యనియె నామ ముండెనఁట. అది కాలక్రమమున బొబ్బిలిగ మాఱినది.

వేఁగి రాజధానిగఁ గల వేంగిరాష్ట్రమును బల్లవులు చిరకాలము పాలించియుండిరని పెక్కు శాసనములు దెల్పుచున్నవి. కాని వేంగికిఁ బూర్వము కూడూరు రాజధానిగ నుండెను. జయవర్మమహారాజెం దుండియె పంతూరను గ్రామమును దానము సేయుచుఁ దన రాజధానీనగరములో

నున్న లేవ వ్యాపృతునకు వ్రాసియుండెను. ఈ శాసనము మహాత్యాగివంశశ్రేష్ఠుఁడును జయవర్మ మహారాజుయొక్క మహాదండనాయకుఁడును నగు బాపహానవర్మచేఁ గూర్పఁబడిన ట్లిందుఁ గలదు.

ఈ దానశాసనములోని విషయ మే మనఁగా:- నెనమండ్రుగురు బ్రాహ్మణ కుటుంబముల కీపంతూరు గ్రామమును ఇరువదినాలుగు భాగములుగ భాగించి యందు గౌతమి గోత్రుఁడగు సప్తార్యున కెనిమిది భాగములును, కౌనవ్య గోత్రుఁ డైన సవిజ్ఞార్యునకు మూఁడు భాగములును గోకణార్యునకు మూఁడు భాగములును, కౌండిన్యగోత్రోద్భవుఁ డైన భావనార్యునకు రెండు భాగములును, భారద్వాజగోత్రుఁ డైన రుద్రవిష్ణునకు నొకటియు నఱభాగమును, ఈశ్వరదత్తున కొక్కటియు నఱభాగమును, ఔపమన్యగోత్రుం డయిన రుద్రఘోషార్యునకు నొక భాగమును, కౌశికగోత్రుం డయిన స్కందరుద్రార్యునకు నఱభాగము నొసఁగి నట్లు లిఖింపఁబడి యుండెను.

ఈ జయవర్మమహారాజు మాహేశ్వరపాదభక్తుఁడ నని చెప్పికొనుటచే శైవుఁడనియు, బృహత్ఫలాయనగోత్రుఁ డనియు, మహారాజని యుండుటచే సామంతుఁడుగాక స్వతంత్ర

రాజనియు వీనిశాసనము కృష్ణామండలమునందు దొరకుట చే నాంధ్రరాజ్యమును బాలించినవాఁడనియు శాసనము ప్రాకృతభాషలోనుండి, లిపి గౌతమీపుత్రశాతకర్ణి యొక్కయు, వాసిష్ఠపుత్ర పులమాయియొక్కయు నాసికశాసనములం బోలియుండుటచే నితఁడును నా కాలము నాఁటి వాఁడె యనియు స్పష్ట మగుచున్నది. వీనిని గుఱించి యింత కెక్కుడేమియుఁ దెలియదు.

# విజయదేవవర్మ.

విజయదేవవర్మ యొక్క శాసన మొకటి నూతనముగ లభించినదఁట. ఇది వేంగిపురమున దొరకిన దగుటచే జయవర్మకుఁ దరువాతివాఁడని చెప్పుదురు. ఏల యనఁ, మొదటఁ గూడూరును, దరువాత వేఁగియు నాంధ్రరాజ్యము నందు రాజధానులుగ నుండిన వగుటచేతఁ గూడూరు రాజధానినగరముగాఁ జేసికొని యున్న జయవర్మకు వేంగి రాజధానిగఁ గల విజయదేవవర్మ తరువాతివాఁడని స్పష్ట మగుచున్నది. ఈ శాసనమును బ్రాకృతభాషలోనే యుండుట చేత నితఁడును మిక్కిలి ప్రాచీనుఁ డనియె తోఁచుచున్నది.

ఇతఁడు సాలంకాయనగోత్రుఁడని చెప్పబడియుండుటచే పల్లవరాజని తెలియనగును. పల్లవులలో సాలంకాయన గోత్రులు, బృహత్ఫలాయనగోత్రులు, రవికులగోత్రులు శంభుకులగోత్రులు ననువారు గలరు. వీని యిష్టదైవము చిత్రరథస్వామి. ఈ స్వామివారి దేవళము వేంగిపురమునఁ గలదు. ఇంతియ వీనిని గుఱించి తెలిసిన విషయములు.

## —* హస్తివర్మ *—

ఇతఁడు వేంగిపురపాలకుఁడయి కాంచీపురాధీశ్వరుం డైన విష్ణుగోపవర్మకు సామంతరాజని తోఁచుచున్నది. మఱికొందఱు స్వతంత్రుఁడనియు నందురు. వీనివలెనే పిష్టపురము (పిఠాపురము) ను బాలించు మహేంద్రవర్మయు నాకాలమునందే యుండినవాఁడు. క్రీ॥ శ॥ 340 వ సంవత్సర ప్రాంతమున సముద్రగుప్తుఁ డుత్తరదక్షిణహిందూస్థానము మీఁదికి దాడివెడలి తన విజయములను గుఱించి యలహాబాదునం దొక శిలాస్తంభముపైఁ జెక్కించెను. అందు హస్తివర్మ, మహేంద్రవర్మ మున్నగువారి నామములు గనఁబడుచున్నవి.

సముద్రగుప్తుఁ డుత్తరమునుండి దక్షిణదేశముపైకి దాడివెడలినప్పుడు దక్షిణకోసలమును మహేంద్రుఁడును,

మహాకాంతారమందు వ్యాఘ్రరాజును, పర్వతము మీఁదనున్న (గంజాంజిల్లాలో మహేంద్రగిరికి 12 మయిళ్లదూరమునఁగలదు.) కొత్తూరునందు స్వామిదత్తుండును, ఈరండపల్లను దమనుఁడును, దేవరాష్ట్రమును కుబేరుఁడును, అవముక్తదేశమును నలరాజును, పిష్టపురమును మహేంద్రవర్మయు, వేంగిని హస్తివర్మయు, పాలక్కడను నుగ్రసేనుఁడును, కుసుల పురిని ధనంజయుఁడును బాలించుచుండిన ట్లీయలహాబాదు శాసనమునఁగలదు. ఇందుజెప్పబడినగ్రామములన్నియు గంజాం, విశాఖపట్నము, గోదావరీ కృష్ణా నెల్లూరు మండలముల లోనివే యై యున్నవి.

ఈ చెప్పఁబడినరాజులలో హస్తివర్మ మహేంద్రవర్మ లనువారలు పల్లవులై యుండి కాంచీపురాధీశ్వరుం డయిన విష్ణుగోపవర్మకు సామంతరాజులుగ నుండియుండిరి. వీ రెల్లరును గలిసి సముద్రగుప్తునిదండయాత్ర నడ్డగించి దక్షిణమునకుఁ బోవనీయ రైరి. అంత సముద్రగుప్తుఁడును దన స్వస్థానమును విడిచి చాల దూరము వచ్చియున్నవాఁ డగుటచే విశేషించి ముందునకుఁ బోవ నిష్టములేనివాఁ డై పేరునకు మాత్రము జయించిన ట్లొప్పించుకొని మఱలిపోయె ననియు నితఁడు కంచివఱకుఁ బోలేదనియుఁ గొందఱు చరిత్రకారులు సెప్పుచున్నారు. ఎవ రెట్లు చెప్పినను బల్లవుల పరిపాలనము

మాత్ర మవిచ్ఛిన్నముగాఁ దత్కాలమున సాఁగుచునే యుండెను. ఆ కాలమునఁ గాంచీపట్నమును విష్ణుగోపవర్మ పాలించుచుండె నని చదువరు లిదివఱకే చదివియుండిరిగదా!

## —* కందవర్మమహారాజు *—

ఈ రాజుయొక్క శాసన మొకటి * కృష్ణాజిల్లాలోని చెజ్జెరాల యను గ్రామమునందు దొరికెను. ఈ శాసనమం దీయనఁ పుత్రికచేత నుకోనిక గ్రామము దానముచేయఁబడిన ట్లుదహరింపఁబడియుండెను. అం దీ కందవర్మ యానందఋషి గోత్రోద్భవుఁడైనట్లును, హిరణ్యగర్భుని వంశజుఁడైనట్లును జెప్పఁబడియుండెను. పల్లవు లెల్లరును దమ శాసనములందు బ్రహ్మవంశజు లనియే చెప్పికొని యుండుటచే వీనిని బల్లవుఁ డనియే నిశ్చయింపవలసియున్నది కాని—

"బ్రాహ్మణోస్య ముఖమాసీత్
బాహూ రాజన్యః కృతః
ఊరూ తదస్య యద్వైశ్యః
పద్భ్యాగ్ం శూద్రో అజాయత."

---

* Ins. No.155 of Annual Report on Epigraphy of 1899.

అనునట్లు చాతుర్వర్ణములవారును బ్రహ్మ యొక్క వదనబాహూర్వంఘ్రులం దుద్భవించిన వార మగుటచే నెల్లరును బ్రహ్మయొక్క సంతతివార మనియె చెప్పికొన నర్హతఁ గలిగి యుండి నక్లించుకొను చుండి రని యూహ్యము.

ఈ శాసనమునందు కందవర్మ మహారాజని చెప్పఁబడి యుండుటయు గాక ధరణికోటకుఁ బ్రాచీననామ మైన ధాన్యకటకమును గుఱించియు, త్రికూటపర్వతమును గూర్చియు జెప్పఁయుండుటచేత నీ కందవర్మ గుంటూరుమండలమునుఁ బాలించిన స్వతంత్రరాజని తోఁచు చున్నది.

## —* అత్తివర్మ *—

వీని శాసనముగూడ గుంటూరు మండలమునందుఁ గల గోరంట్ల గ్రామమునందు దొరకుటచేతను, నందు నానందగోత్రోద్భవుఁ డయిన కందవర్మపుత్రుఁ డత్తివర్మ*యని యుండుట చేతను, ఇతఁడు పై నుదహరింపఁబడిన కందవర్మ పుత్రుఁ డయి యుండవచ్చు నని తోఁచెడిని.

ఈ రాజాత్మకుడు గ్రామమును, కృష్ణవేణీ దక్షిణ తీరమందుఁగల తాతికుంట గ్రామములో అష్టాశతపట్టి పరిమాణముగల పొలమును కోటిశర్మ (కొట్టిశర్మ) యను

* Indian Antiquary Vol. IX. Page 101, 103.

బ్రాహ్మణునకు దానముచేసినట్లును వర్ణింపఁబడి యుండెను. ఈ శాసనము సంస్కృతభాషలో లిఖింపఁబడి యున్నందున నితఁడు నాలవ శతాబ్దములోనివాఁడై యుండవచ్చును. ఇతఁడును గుంటూరు మండలమును పాలించిన వాఁడె యై యుండును.

## —* చండవర్మ *—

ఈయన కళింగదేశమును బరిపాలించిన మహావీరుఁడు. చండవర్మ మహారాజు పితృభక్తితత్పరుఁడును, దానశీలుఁడును నైనట్లు వీని శాసనములె నిదర్శనములుగ నున్నవి. కాని యీతని రాజధాని యెద్దియో యేకాలమునాఁటి వాఁడో స్పష్టముగఁ దెలియ రాకుండెను. అయినను గంజాం మండలములోని శ్రీకాకుళమునకును నరసన్నపేటకును మధ్యను సింగపుర మను నామాంతరముగల సింహపురమునుండి యీ చండవర్మ మహారాజొక దాన శాసనమును బ్రకటించి యుండెను.

ఈ శాసనమునందుఁ దన యాఱవ పరిపాలనకాలమున చైత్రశుద్ధ పంచమినాఁడు దేవశర్మయను నొక బ్రాహ్మణునకు భావిఫల ప్రాప్తికై కోహితూరు (కొత్తూరు) అను గ్రామమును దానముచేసినట్లు లిఖింపఁబడి యుండెను.

ఈ శాసనము గంజాము మండలములోని నరసన్నపేటకు రెండుమైళ్లదూరమున నున్న 'కోమర్తి' యను గ్రామమున సంపాదింపఁ బడెను. ఇందలి లిపినిబట్టి చండవర్మ నాలవ శతాబ్దములోని వాఁడని చరిత్రకారు లూహించిరి. చాల భాగము సంస్కృతమయమై శాసనధర్మముల నతిక్రమించి వర్తించువారిని శపించు భాగము మాత్రము శ్లోకరూపమున నుండి మిగిలిన దంతయు గద్యరూపమున నుండెను. వీని శాసనమునందును 'పితృభక్తః' అని యుండెను.

ప్రస్తుతకాలమునందలి కొందఱవలెఁ గాక ప్రాచీన కాలమున— "మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్య దేవోభవ" అని తలిదండ్రులను గురువులను దైవసమానులుగ నెంచి మిక్కిలి భక్తిశ్రద్ధలతోఁ బూజించుచుండెడువారు. ఆ విషయములను హృదయమునం దుంచుకొనుటయేగాక యాచంద్రతారార్కముగ నుండునట్లు తమ శాసనములందును 'పితృభక్త' అని లిఖించుకొనుచుండిరి.

## —* నందప్రభంజనవర్మ *—

కళింగదేశమును బాలించిన చండవర్మ నామముగాక మఱియొక పల్లవరాజనామము గానఁబడెను. ఈయన నంద

ప్రభంజనవర్మ. వీని శాసన మొండు*గంజాము మండలములోని శ్రీకాకుళమునఁ గనుఁగొనఁబడెను. నందప్రభంజనవర్మ యీ శాసనమును సారపల్లి గ్రామమునుండి ప్రకటించెను. ఇందు దేవరాతగోత్రు లయిన చారణులకును, హారిశ్చంద్రస్వామి యను బ్రాహ్మణునకును, 'జేయువట' మను గ్రామమును దానము చేసినట్లు చెప్పఁబడి యుండెను.

ఈ శాసనములోని లిపి చండవర్మ శాసనములోని లిపిని బోలి యుండెను. చండవర్మకు వలెనె నితఁడును 'పితృభక్తః' అనియుఁ గళింగాధిపతి యనియుఁ జెప్పికొని యుండెను. ఇందుచే వీ రిరువురు నొక కుటుంబములోని వారై యుందురని చరిత్ర పరిశోధకు లూహించి వ్రాసి యుండిరి. వీరి యూహానుసరణిని నందప్రభంజనవర్మ సాలంకాయన గోత్రోద్భవుఁడైన పల్లవ రాజకుల తిలకుఁడై యుండును.

ఈవిధముగఁ గొంతకాల మువక్రవిక్రమంబున ద్రవిడాంధ్ర రాజ్యములం దసమాన వైభవంబున రాజ్యపాలన మొనరించి, కాలక్రమమున విధివశమునఁ దమ యపార రాజ్యమును గోల్పోవుచు నందుఁ జిన్న చిన్న రాజ్యములకు స్వతంత్రులుగను సామంతులుగను పాలించుచుండినను దమ సహజ వితరణగుణానుగుణ్యముగ బహు భూదా

* Indian Antiquary Vol. XIII. Page 48.

నాదులం గావింపుచు, ననేక దేవాలయ స్థాపనోత్సాహకులై పెక్కు శిలాతామ్ర శాసనాదుల వెలయించి తమ నామ మాచంద్రార్కముగ వెలయించినవారగుటచే మన మీపాటి వృత్తాంత మైనను దెలిసికొనుట కవకాశము గలిగినది.

ఈ పైనం జేర్కొనంబడిన వారలేగాక మఱికొందఱు పల్లవరాజముఖ్యులం దందు స్వతంత్రులుగను సామంతులుగను యుండి కీర్తి ధనమును గడించి మించినవారు గలరు.

పాండ్య, చోడ, చేర, చాళుక్యరాజులు విజృంభించి తమ రాజ్యముల నాక్రమించుకొని తమ్ము బలహీనులుగం జేసినప్పుడు దైవబలము చాలమి నెంచుక మిన్నకుండి మఱల కాలగతికై నిరీక్షించుచు దైవసంఘటనచేం బూర్వోక్తరాజ్యములు క్షీణదశ నొంద నున్న తఱిం బల్లవరాజులు మఱల నుత్సాహపూరితులై తమపూర్వులు గోల్పోయిన రాజ్యములను గ్రమ్మఱ సంపాదింపం బ్రయత్నించిరి.

అట్టివారిలో నందివర్మమహారాజు, అల్లుంతిరుకాళత్తి దేవరాజు, అభిదేవమలిదేవమహారాజు, ఇమ్మడిదేవమహారాజు మహారాజసింహుండు మున్నగువారు గలరు. వీరుగాక త్రిపురాంతక శాసనములలో:— అల్లాడ పెమ్మయదేవ మహారాజు, విజయగండ గోపాలదేవ మహారాజు, పొడకనూరి

సిద్ధిరాజు, వీని మనుమఁడు జల్లాడనాథదేవమహారాజు, మధుసూదన దేవ మహారాజు, భీమయదేవ మహారాజు, వీని కుమారుఁడు సిద్ధమదేవుల విజయదేవుఁడు, విజయాదిత్య దేవ మహారాజు మొదలగువారల నామములు పల్లవరాజుల శాసనములందుఁ గనఁబడుచున్నవి. వీరెల్లరును బల్లవవంశసంజాతులయి స్వతంత్రులుగనో, సామంతులుగనో, లేక రాజకుటుంబములలోనివారుగనె యుండి తమ పేరిట దానశాసనముల వెలయింపఁజేసి యుందురు. వీరిలో జగత్ప్రసిద్ధులైన వారి సంగ్రహ చరిత్రను మాత్ర మిట వివరించెద:—

## —* నందివర్మమహారాజు *—

ఇతఁడు శాలివాహన శకము 1024 నకు సరియైన చిత్రభానునామ సంవత్సర వృషభమాసమున (క్రీ॥ శ॥ 1102వ సంవత్సరము) నత్యంత వైభవముతోఁ జోడపురమునఁ బట్టాభిషిక్తుఁ డయ్యెను. ఈ మహారాజు మాదురేవి, పెనుగోడు సీమలఁ బాలించువారిని దన సామంత రాజులనుగ జేసికొనెను.

వీనికి జారపరాజు తండ్రియు, దుర్గాదేవి తల్లియు, ఇరుగరాజు- నరవర్మరాజు నన్నలును, భీమరాజు- బంధురాజు దమ్ములును నై యుండిరి. వీని ముక్కంటికాడు వెట్టియును,

వంశమునకుఁ జెందియుండి కంచిలోని కామకోట్యంబిక యిష్ట దైవముగాఁ గలవారు. అయినను వేంగడము (తిరుపతి) లోని వేంగడనాథుని (వెంకటేశ్వరస్వామిని) దర్శించితినని చెప్పికొని యుండుటచే శివకేశవభేదము లేనివారని తోఁచు చుండినను శైవుఁడే యని చెప్పవలసి యున్నది.

ఇతని రాజ్యము నెల్లూరు మండలమునందలి ప్రాగినాడు వఱకు విస్తరించి యుండెను. ఈ రాజొక చంద్రగ్రహణ కాలంబున- త్రిమిడికల్లు, గుడిమెట్ట, బద్దిమడుగు, కోకూరు, ఉప్పల పురము, రావిపాడు, ఇద్దుకొలపాడు, ఇబ్రమసకింద్ర సంగము, గోనుగుంట, గుడిపాడు గ్రామములను బీనకొటుంబిసుల కగ్రహారములుగ నిచ్చివేసిన నరేంద్రుఁడు. మఱియు నాటూరు గ్రామములోని యిరుగేశ్వరునకును నాగేశ్వరునకును దేవళములను మండపములను గోపుర ప్రాకారములను నిర్మించి వాసిగాంచి యుండెను. మఱియు వింధ్యాద్రిని యను గుడిని గట్టించెను. షోడశసముద్ర మను సుకోశాగారమును త్రవ్వించెను. వృషభేశ్వరునకును దాకేశ్వరునకును భూదానములను జేసి పూఁదోటలను నెలకొల్పెను. తన తలిదండ్రుల పేరిటను సోదరుల పేరిటను దేవాలయ గోపుర మండప ప్రాకారాదుల నిర్మించి కీర్తికాయుఁడయ్యెను. ఇంకను బెక్కు

దేవస్థానములకు భూదానములఁ గావించి యుండెను. ఈ మహారాజు:—

శ్లో॥ తటాకం ధననిక్షేపం బ్రహ్మస్థాపనమేవచ
వనం శివాలయం కావ్యం సుతాస్స్యస్సప్త దా నృణాం॥

అను *సప్తసంతానములం దాసక్తి గలవాఁడై వాని

---

* మానవుఁ డాచరింపవలసిన సమస్తపుణ్యకార్యములలోను సప్తసంతానము లనునవి యత్యంతప్రాముఖ్యము లైన వని పెక్కుగ్రంథము లందుఁ జెప్పఁబడి యున్నవి. సప్తసంతానము లనఁగా—

క॥ "తనయుఁడు చెఱువును గావ్యం
బు నిధానము గుడి వనంబు భూదేవస్థా
పనమును నను నిద్యోగను
జను శాస్త్రము లందు సప్త సంతతు లనఁగన్."

ఈ సంతానము లేడింటిలోఁ గావ్యము శాశ్వత మై యాచంద్రార్కము విరాజిల్లుచుండు ననియు నప్పెంత కాలమున నెవ్వని కీర్తిచంద్రిక లీయిహలోకమున విరాజిల్లుచుండునో యాతఁ డన్ని దేవతాయుగములు దేవతాసభ యగు సుధర్మయందు విలసిల్లుచుండు ననియుఁ బలు గ్రంథము లందు వర్ణింపఁబడి యున్నది. ఎట్లన—

క॥ ధర్మములలోన నుత్తమ
ధర్మము గావ్యము నిజంబు ధర నెవ్వని కా
ధర్మము చేకుఱు నతఁడు సు
ధర్మను వసియించుఁ బెక్కు దైవతయుగముల్.

(అప్పకవి)

నెల్ల నిర్వర్తించినట్లు వీని శాసనములం బట్టి గ్రహింప దగి యున్నది.

---

మఱియును నీ సప్తసంతతులలోఁ గృతిస్వీకారము యుత్తమోత్తమ మనియు, దీనిచే నుభయవంశము లందును (తల్లివైపును దండ్రివైపును) నూటొక్కతరముల వారిని నరకమునుండి తప్పించి సద్గతి గలిగించుననియుఁ జెప్పఁబడి యున్నది. లక్షణశాస్త్ర మగు నప్పకవీయములో నిట్లు గలదు.—

తే॥ గీ॥ "దుష్కృతము లెన్ని చేసినఁ ॥ దుదిని సప్త
సంతతులలోన నొక్కటి ॥ సలుపు నతఁడు
కుతుకమునఁ దన నూటొక్క ॥ కులము వారి
నరకములఁ బాపి ముక్తికి ॥ ననుపు నిజము
నెగడుఁ గావునఁ గావ్య మ ॥ న్నిటికిఁ దొడవు."

ఎట్టి పాపాత్ముఁ డైనను నీ సప్తసంతానములలో ముఖ్యమైన దగు కృతిస్వీకారము గావించుకొనఁ గలిగ నేని యతఁడు పరమపావనుఁ డై స్వర్గలోక సుఖముల ననుభవింపఁ గలఁ డని చెప్పఁబడి యున్నది. ఎట్లన—

క॥ "పురిపఱద నీడు గోదా
వరిని గలసి యోగ్యమైన ॥ వడువునఁ గడు దు
శ్చరితుం డైనను గావ్యాం
తరమునఁ జెప్పఁబడి పావన చరిత్రుఁ డగున్.

క॥ క్షితి నెవ్వనినామము స
త్కృతి నెన్నిదినంబు లుండు ॥ నది నా పుణ్య
వ్రతుఁ డంతకాల ముండును
ధృతి నింద్రద్యుమ్ను నునికి ॥ దృష్టాంతముగన్."

(అప్పకవీయము)

విఖ్యాతయశుఁడైన నందివర్మమహారాజు క్రీ॥ శ॥ 1102 వ సంవత్సరప్రాంతమున నఖండైశ్వర్యముతోఁ బాల

---

మఱియుఁ బైన జెప్పఁబడిన సప్తసంతానములలోఁ గృతియె ముఖ్యమైన దనుటకుఁ బెక్కు గ్రంథంబు లందుఁ దద్విశేష మిట్లు ప్రశంసింపఁబడియున్నది.

గీ॥ "సప్తసంతానములలోఁ బ్రశస్తిఁ గాంచి
ఖిలము గా కుండునది ధాత్రిఁ గృతియెఁ గాన
కృతి రచింపుము మాకు శిరీషకుసుమ
పేశలసుధామయోక్తులఁ బెద్దనార్య."

(మనుచరిత్ర)

గీ॥ తరు తటాకాది సంతతుల్ ధరణి నెచట
నిలిపి రచటనె యుండు వానికిని గృతిము
ఖంబున నే విశ్వవిఖ్యాతిఁ గాంచుఁ గృతియె
సంతతివతంస మది మాకు సంఘటింపు॥

(వసుచరిత్ర)

గీ॥ ధార్మికులలోనఁ గృతిపతి ధన్యుఁ డతని
కీర్తి గంగ తెఱంగునఁ గ్రీడ సేయు
ప్రాజ్ఞ[illegible]ంబుల [illegible]సరోముఖ్యవివిధ
సంతతుల కంటెఁ గృతి మహాశాశ్వతంబు.

మూఁగి యనేక భూదానాదులఁ గావించి చిరస్మరణీయ కీర్తికాయుఁ డయి విలసిల్లెను.

క॥ గండి తెగి చెఱువు పాడగు
ఖండింప నశించు వనము ♦ ఘనవృష్టిమహా
త్తాండవముల గుడి గూలు న
ఖండిత మై కావ్య మమరు ♦ గలకాలంబున్॥

(రామ విలాసము)

సీ॥ రామాయణము కవి ♦ రచియించుటనె కదా
రఘువంశవిఖ్యాతి ♦ రహి వహించె
భారతంబును వ్యాస ♦ భట్టారకుఁడు సెప్పఁ
బాండుసూను చరిత్ర ♦ పరిఢవిల్లె
కాళిదాసుండు స ♦ త్కవితఁ జేర్చుటఁ గదా
భోజరాజచరిత్ర ♦ భువిని నిలచె
పెద్దనార్యుఁడు కృతిఁ ♦ బెంపుఁ జూపుటఁ గదా
దేవరాయచరిత్ర ♦ తేజరిల్లె
గీ॥ గాన నీరీతి సత్కృతి♦కర్త భర్త
ధరిణి వెలయుదు రాచంద్ర♦తారకముగఁ
గృతి యనఁగ ధర శాశ్వత ♦ కీర్తిదనువు
గనుకఁ గృతి నొందవలయు భూ♦కాంతుఁ డెపుడు॥

(రామకృష్ణాష్టరూప నారాయణీయము

## —* అల్లుంతినుపాళత్రిదేవరాజు *—



ఇతఁడు క్రీ॥ శ॥ 1182 వ సంవత్సరమం దుండిన

---

సీ॥ గండి తెగుటనో స ♦ కాలానుగుణ్యావ
ర్షప్రాప్తి లేమినో ♦ సరసు లింకు
చోరనిరంకుశ ♦ క్షోణీశ దుర్న్యాయ
త్వంబుల ధననిధుల్ ♦ నాశ మగును
భూరినిదాఘాత ♦ పోగ్రతీక్ష్ణత చేత
వరభూరుహోపేత ♦ వనము లెండు
ఉర్వీ నపాత్రున ♦ కొనరింపఁబడిన బ్ర
హ్మస్థాపనం బెన్న ♦ వ్యర్థ మగును
గీ॥ ఊహతీరానిలోద్ధతి గుడుల్ ♦ విరిసి కూలు
కొడుకు దుశ్శీలుఁ డైనచో ♦ గోడు గూర్చు
గాన నాచంద్రతారభా ♦ స్కరము వెలుగు
సత్కృతియె వతంసము సప్త ♦ సంతతులను.

(కొండవీటి విజయము)

ఇట్లు సమస్తగ్రంథము లందును గృతిమాహాత్మ్యము వర్ణింపఁబడి యున్నది. అందుచేఁ గవులకుఁ బూర్వప్రభువులు రత్నహారములు, గుఱ్ఱములు, నేనుగులు నగ్రహారములు నిచ్చి ప్రోత్సహించి యుత్తమగ్రంథంబుల వ్రాయించి

పల్లవరాజు. వీనిశాసనములు నెల్లూరుసీమలోఁ బెక్కుట
గనఁబడినవి. అం దీతఁడు విశేష భూదానములఁ గావించిన

---

కృతు లందు చుండిరి. భట్టుమూర్తి దాను సత్కరింపఁబడినవిధము వసు
చరిత్రయం దీరీతి గలదు.

శా॥ శ్రీరామక్షితిపున్ మదగ్రజు జయ♦శ్రీలోలు నానాకళా
పారీణున్ బహుసంస్కృతాంధ్రకృతులన్♦బల్కాలు మెప్పించి త
త్కారుణ్యంబున రత్నహారహయవే♦దండాగ్రహారాది స
త్కారం బందితి రామభూషణకవీ ♦ ధన్యుండ వీ వన్నిటన్!

ఇట్టికృతు లందు ఛందోదోష మున్న యెడఁ గృతిభర్తకు గీడు వాటిల్లు
ననియు శ్రీకారముతోఁ గూడిన మగణ మాదిఁ గల పద్యము గ్రంథారంభమునఁ
జెప్పఁబడినచో నది సమస్తదోషముల నడఁగించు ననియు లక్షణశాస్త్రములం
దీరీతి గలదు.

గీ॥ వేదముల కెల్ల నోంకార ♦ మాది యైన
కరణిఁ గృతులకు నెల్ల శ్రీ ♦ కార మాది
గానఁ గవివరు లెల్లను ♦ దానిఁ దక్క
నితరవర్ణంబు నిడరు స♦త్కృతుల మొదల.

క॥ పదపడి శ్రీకారము కృతి
మొదల నిలిచి దోషపుంజము నడంచి శుభం
బొదవించుఁ బరుస మినుమును
గదిసి సువర్ణంబు సేయు ♦ కరణిన్ ధరణిన్.

ట్లును జాల దేవళములసంస్కరించి యుద్ధరించినట్లును నగ్రహారములు నెలకొల్పినట్లును గలదు.

గండవరము గ్రామములోని శాసనములోఁ దాను బల్లవుఁడ నని చెప్పికొని యుండెను. ఈ రాజు స్వతంత్రుఁడు గాక తెలుఁగు చోడరాజుల క్రింద సామంతుఁడుగ నుండి యుండ వచ్చునని కొంద ఱూహించిరి.

అభిదేవమతిదేవ మహారాజు వీని శాసనములలో దన్ను గుఱించి తాను బల్లవుఁడననియు, భారద్వాజగోత్రుఁడ

---

పరుసవేదిని సోకిన యినుము బంగార మగు నట్లు సమస్తదోషములును శ్రీకారప్రభావముచే నడఁగు నని చెప్పఁబడి యుండుటచే గ్రంథారంభ మందు శ్రీకారము గల పద్యములను వ్రాయుదురు.

కృతులం దిట్టి ప్రభావ ముండుటచే శాస్త్రపరిచయముగల కీర్తికాము [illegible]ను సత్కవుల నాదరించి యుత్తమగ్రంథంబుల వ్రాయించి కృతు లందుచు శాశ్వతకీర్తి విరాజితులగుచుందురు. ఐహికాముష్మిక సాధకం బైనయీకృతి స్వీకారాభిలాషమూలమున భాషాభివృద్ధియగుచు లోకంబునకు మహోపకారము గలుగుచుండును. కాశీ రామేశ్వరాది యాత్రలుసల్పుచు శాస్త్రోక్త ధర్మంబు లందు విశ్వాసము గల మహనీయు లెల్లరుఁ గృతిస్వీకారము వలన నీ లోకమున నాచంద్రార్క విరాజితకీర్తి ధనంబును, బరలోకమున శాశ్వతానంద సుఖములను బడయ గలుగు నట్లుత్తమ గ్రంథముల వెలయించెదరు గాత.

వనియుఁ జెప్పికొని యుండెను. ఇతఁడును దనితరాజులవలె ముక్కంటికాడువెట్టి వంశజుఁడై కంచిలోని కామకోట్యం బికకుఁ బాదభక్తుఁడై యుండెను. ఇతఁడును ననేకాగ్రహార భూదానాదులఁ గావించి యుండెను. వీని శాసనములంబట్టి యితఁడు క్రీ॥ శ॥ 1218వ సంవత్సర ప్రాంతమునం దుండెను.



—* ఇమ్మడి దేవ మహారాజు *—

ఐ వన్నిఽ

ఇతఁడు భీమరాజునకును సిరియాదేవికిఁ బుత్త్రుఁడు [illegible] క్రీ॥ శ॥ 1268వ సంవత్సర ప్రాంతమున నున్న [illegible] గ్రంథారాధ్య [illegible] రాజు. ఇతఁడు శ్రీశైలమునకుఁ దూర్పుభాగమున లక్షణకాల్వ [illegible] యగ్రహారములను నెలకొల్పి మహాభక్తాగ్రగణ్యుఁడై పెక్కు ధర్మకార్యములాచరించినట్లు వీని [illegible] యగ్రహార సంఖ్యయె తెలుపుచున్నది.

తన తల్లిదండ్రుల యాముష్మికసుఖంబులకై [illegible] వరమునం దితఁడొక దేవాలయమును నిర్మించి యందు శ్రీ చెన్నకేశవ పెరుమాళ్లను ప్రతిష్ఠించెను. ఈ స్వామి పూజా కైంకర్యాదులకై శ్రీరంగభట్టుగారికైన పెరుమాడి [illegible] నియమించి గొప్ప భూదానములు గావించియుండెను.

## * మహారాజసింహుఁడు *

ఈ రాజు మహాదాతయు, మిక్కిలి ప్రసిద్ధుఁడు నైనటుల తెలియుచున్నది. ఇతని దానశాసనములు క్రీ॥ శ॥ 1243 మొదలు 1279 వఱకుఁ గనఁబడుచునే యుండెనఁట. ఈ శాసనములు కందనోలనఁబడు కర్నూలు మండలములోఁ గల త్రిపురాంతకమునందును, గోదావరి జిల్లాలోని ద్రాక్షారామమునందును గనఁబడుటచేత నితఁడు తెలుఁగు దేశమందున్న సామంతప్రభువో లేక కాకతీయులతో స్వసైన్యములఁ గూర్చికొని పోరాడుచు వచ్చిన స్వతంత్రుఁడో యూహింపఁ దగిన కారణములు గానరాకుండెను.

ఎట్లయిన నేమి, పదమూఁడవ శతాబ్దాంతము నుండి పల్లవరాజ్య భాస్కరుఁ డస్తమింపఁ దొడంగెను. పరరాజ కీర్తిచంద్రికలు ప్రకాశింప నారంభించెను. అయినను నందందు మన పల్లవరాజ్యచిహ్నతారకలు మిణుకుమిణుకు మనుచుఁ దమ కాంతుల నీనుచునే యుండెను.

నాఁటినుండి నేఁటి వఱకు స్వతంత్రులుగనో, సామంతులుగనో తుదకు జమీ పాలకులుగను యుండి మన ప్రస్తుత హూణప్రభుత్వమువారిచేఁ గూడ నాదరింపఁబడుచు గౌరవ

భావముతోఁ జూడఁబడుచున్న వారిని గుఱించి రాఁబోవు ప్రక
రణమున వివరింపఁబోవుచుఁ బ్రకృతమున నీ పూర్వ పల్లవ
రాజులకు ద్రవిడాంధ్ర దేశములలో రాజధానీనగరములుగ
నుండిన కాంచీపురము వేంగి యను వానిగుఱించి యించుక
చదువరుల కెఱింగించుట యప్రస్తుతము గాదని తలంచి
యట్లు చేసెదను.

---

## —* కాంచీ పట్నము. *—

---

పల్లవులచేఁ బాలింపఁబడిన దక్షిణదేశములోఁ గొంత
భాగమునకు బూర్వము తొండైమండలమని పేరుగలదు. దీనికి
నుత్తరమునఁ దిరుపతి కాళహస్తి పర్వతములును, దక్షిణమునఁ
బాలేఱును, బడమట ఘాట్లు లనఁగా గట్టులును నెల్లలు—
దొండై మండల శతకమునందును, మఱియొక శతకములో
నుత్తరమున వేంగడమును (తిరుపతి) దక్షిణమున పినాగి యను
నదియుఁ దూర్పున సముద్రమును బడమటఁ దూర్పు కనుమ
లనియు వర్ణింపఁబడియుండెను. తొండైమండల మన దండక
నాడుయొక్క రూపాంతరమై యుండుననియు, నిదియె సంస్కృ
తమున దండకారణ్య మనఁబడునది యనియుఁ జెప్పుదురు.

ఈమండలమునకు రాజధానీనగరముగఁ గాంచీనగరమును నిర్మించుకొని పల్లవరాజులు పెక్కు శతాబ్దములు పరిపాలించిరి. ఇందు ముఖ్యముగఁ బల్లవరాజులచేఁ బెక్కు దేవాలయములు గట్టింపఁబడెను. వానిలోఁ గైలాసనాథ దేవాలయమును, మఱికొన్ని దేవళములును నత్యున్నతములై యపూర్వవైభవముతో నలరారుచుండును. ఈదేవాలయప్రాకార గోపురాదులం దనేక దానశాసనములు గలిగియుండుట మన చరిత్రరచన కెంతయో సహాకారములైనవి. నేఁటికిని యందుఁగల పల్లిగోపుర మనునది మిక్కిలి యౌన్నత్యముగలిగి తన శిల్పకళానైపుణ్యముచేఁ జూచువారల కచ్చెరువును గలిగించుచుండును.

ఇందుఁ బెక్కు శిలామంటపములును, సత్రశాలలును గలిగి విరాజిల్లుచున్నది. మఱియుఁ గాంచీపురము దక్షిణదేశమందుఁగల పుణ్యస్థలములలో ముఖ్యమైనదియై నేఁటేఁటఁ బెక్కు వేలమంది యాత్రికులచే సందర్శింపఁబడుచున్నది. మఱియు నిచట జరుగు వరదరాజస్వామివారి యుత్సవ మత్యంతవైభవముతోఁ గూడినదియై యుండును.

విశ్వబ్రాహ్మణుల యిష్టదైవ మగు కామాక్షి దేవాలయ మొం డిందుఁ గలదు. ఈయాలయమునకు సమీపముననే యింకొల్లు కామాక్షమ్మ యను నామెచేఁ దనభర్త జీవితాంతమునఁ

దనవశము చేసి యుంచిన యేఁబదివేల రూప్యములను వెచ్చించి యొకగొప్ప సత్రమును నిర్మించెను. ఇందు యాత్రికులకుఁ దగు వసతులు గలిగి మిక్కిలి సౌఖ్యకరముగ నుండును.

కాంచీనగరము పల్లవచరిత్రకు సంబంధించిన పెక్కు శిలాశాసనములను శిల్పకళానైపుణ్యమును గలిగి విరాజిల్లుచుండును. భక్తాగ్రేసరుల యుల్లంబు లుల్లసిల్లఁజేయు ననేక మహోన్నత దేవాలయ గోపుర ప్రాకారములు గలిగి దీపించుచుండును. యాత్రికుల కన్నుల పండువు సేయు నుత్సవాదులచే నిరంతరశోభాయమానముగ నుండును.



## —* వేంగీపురము *—



వేంగీపురమునుగుఱించి మ॥ రా॥ శ్రీ॥ చి. వీరభద్రరావుగారి యాంధ్రదేశకథాసంగ్రహమున స్పష్టముగ వర్ణింపఁబడి యున్నది. ఒకచో నాభాగము నుందుఁ బొందుపఱచెదఁ:— "వేంగిదేశమునకు ముఖ్య పట్టణముగా నుండిన వేంగీపురము కృష్ణామండలము లోని యేలూరునకు నుత్తరమున నెనిమిదిమైళ్ల దూరమున నుండెడిది. ఆస్థానమున నిప్పుడు పెదవేఁగి, చినవేఁగియను పల్లెలు మాత్రము గలవు. వీనికి దక్షిణమున [illegible] దూరమున

దొంతాబూదను గ్రామము గలదు. ఈగ్రామమునకు గంగన గూడెము, సీతనగూడెము మొదలగు సివారుపాలెములు చుట్టును నున్నవి. ఇవి యన్నియుం గలిసి యొక మహాపట్టణము గానుండి వేంగీపుర మని పిలువం బడుచుండెను. ఈప్రదేశము నందు శిథిలమై పోయిన శివాలయములు పెక్కులు గలవు. మఱియును విఘ్నేశ్వరుని యొక్క విగ్రహములు నాలుగు దెందులూరునకు దక్షిణముగా నున్న చెఱువు సమీపమున నుండి యున్నవి. వానిలో నొకటి మిక్కిలి పెద్దదిగా నున్నది. ఈ గ్రామమునకుఁ దూర్పు ప్రక్కను భీమలింగముదిబ్బ యను పేరు గల యెత్తయిన యొక పాటిమట్టి దిబ్బ గలదు. దానికి నుత్తరముగ మూకమ్మ చెఱువును దాని నడుమ నొక మట్టిదిబ్బయును, దానిపై రెండు ఱాతినందులును గలవు. ఈగ్రామమునకుఁ బడమరగా నొక చెఱువు గలదు. దానిని నారికేళవారి చెఱువని చెప్పుదురు. దానిగట్టుపైని రెండు శిలాశాసనములు నిలువుగాను, మఱిరెండు సాఁగిలం బడియు నుండెను. పెదవేఁగికిని జినవేఁగికిని నడుమ మఱియొక మంటిదిబ్బ గలదు. వీని నన్నిటిని బరిశోధించి చూడఁగా వేంగీపురము మిక్కిలి యున్నతస్థితియం దుండిన పూర్వకాలమున నొక యందమైన మహానగరముగ నుండె ననుటకు సందియము లేదు. ఇచ్చటి దేవాలయముల యొక్క ఆలను

దురకలు గొనిపోయి యేలూరులోని కోటను గట్టిరని తెలియుచున్నది. వేంగీపుర మనియెడి మహానగర మొకటి యెక్కడనుండెనో యని కొందఱు సంశయించుచుండిరి, గాని విజయదేవవర్మ యొక్కయు, విజయనందివర్మ యొక్కయు శాసనము లాసంశయమును నివారించినవి. మఱియును దండి యను మహాకవి కొల్లేటిని వర్ణించుచు దానికి ననతిదూరముగా నుండిన యీ వేంగీపురమునె యాంధ్రనగరి యని పిలిచియున్నాఁడు. విజయదేవవర్మ విజయనందివర్మ శాసనములలో నుదహరింపఁబడిన చిత్రరథస్వామి దేవాలయ మిప్పటికిని నిలచియుండి యాపేరుతోనె పిలువంబడుచున్నది."

ఇట్టివర్ణనలచే నుతికెక్కిన కాంచీపుర వేంగీపురములు రాజధానీనగరములు గాఁగాఁ బల్లవులు ద్రవిడాంధ్రదేశములను మహోన్నతవైభవమునఁ బెక్కు శతాబ్దములు పరిపాలించి తమ కీర్తిచిహ్నములుగ ననేకజయస్తంభములను [illegible] చిరస్మరణీయులైరి. దక్షిణదేశమునఁ గల [illegible] యత్యద్భుతశిల్పకళాచాతుర్యముచే నత్యంత మనోహరములై వెలయుచున్నవి. ఈదేశములలోఁ గొన్ని [illegible] దొరికి [illegible] నిర్మింపఁబడిన దేవాలయములు [illegible] మహాశ్చర్యమును గలిగించునవి యై [illegible]

లై యున్నవి. ఇవియన్నియుఁ బల్లవరాజులచే వెలయింపఁ బడి నవియె.



## —* శి ల్ప క ళ *—

విశేష విమర్శనము జేసిన పిమ్మటఁ జిత్రకారులు పల్లవుల దేవాలయ శిల్పవిశేషమును గుఱించి చతుర్విధము లైన భేదములు గలవని వివరించియుండిరి. అందు క్రీ॥ శ॥ 610 మొదలు 640 వఱకుఁ బాలించిన మహేంద్రవర్మ పద్ధతి యొకటి క్రీ॥ శ॥ 640 మొదలు 674 వఱకుఁ బాలించిన మామల్లుని (మహామల్లుని) పద్ధతి యింకొకటి. 674 మొదలు 800 వఱకు నుండిన రాజసింహునిపద్ధతి వేఱొకటి. 800 మొదలు 900 వఱకు నపరాజితుని కాలములో నేర్పడినపద్ధతి మఱియొకటి. ఇట్లు నాలుగువిధములుగ దేవాలయనిర్మాణవిధానములం గూర్చి చెప్పుచుండిరి.

తంజావూరు పుదుకోటలమధ్యఁ గల సీమలందుఁ బాండ్య చోళరాజుల యాధిక్యతచే జరిగియుండిన మత్తరాయలకాల మందిట్టి శిల్పనైపుణ్యము గానరాక కేవలము కంచి రాజధానిగా గల దొండైమండలమునందే కానవచ్చు నీశిల్పవైభవము మిక్కిలి

ప్రశంసనీయముగ నుండె నని యెంచఁబడుచుండెను. వల్లం, మహేంద్రవాడి, తలవానూరు, శియమంగలము, పల్లవరం, అను నగరరాజములయందు వెలయుచున్న దేవళములు సింహ విష్ణుని కుమారుఁడైన మహేంద్రవర్మచే గట్టింపఁబడినఁ వని మతవిలాసప్రహసనాది గ్రంథాములచేఁ దెలియఁబడు చున్నది.

ఈ దేవళము లన్నియుఁ దొండైమండల మందే గలవు. ఇవి సుంద్రని లింగములను, ప్రత్యేకపద్ధతులు గలిగిన ద్వార పాలురనుఁ ద్వారములపైఁ జెక్కింపఁబడిన జంటతోరణములను బలకలు దీర్చఁబడిన స్తంభములను గలిగియుండెను. శిలల యందు మిక్కిలి సుందరములైనట్టియు నద్దమువలెఁ దళతళ లాడునట్లు నునుపుజేయఁబడినట్టియు శిలావిగ్రహములు గలిగి హైందవశిల్పకళాచాతుర్యమును జాటు చుండెను.

రాజసింహునికాలములోఁగట్టింపఁబడినదేవాలయములలో గొండలనుండి తొలిపింపఁబడినవి మిక్కిలి యరుదుగ నుండెను. చాలవఱకుఁ బెద్దపెద్ద ఱాలొకదానిపై నొకటి జేర్చఁబడి కట్టఁ బడియుండెను. సోమస్కంధవిగ్రహమునకు ముందొక విధ ముగాఁ జెక్కింపఁబడిన లింగములు గలవు. ఇందలి తోరణ మొక్క వరుసయె కలిగియుండెను.

మహాబలిపుర మందుఁ గల గుహాలయములును త్రాతి

రథములును గొన్ని ప్రథమ నరసింహావర్మచే ప్రారంభింపఁబడి ప్రథమ పరమేశ్వరవర్మ కాలమున సంపూర్తి చెందెను. కాని యింకను గొన్ని యసంపూర్తిగ నున్నవియును గలవు. ఇందలి యాలయములందుఁ గల ద్వారపాలురు మహేంద్రవర్మచేఁ జెక్కింపఁబడిన రీతిఁగాక వేఱువిధముగ నుండెను. స్తంభముల పై సింహములు గూడఁ జెక్కింపఁబడియుండెను. మహాబలిపుర మందు నిట్టి గలవు. ఇందలి మండపములును దదితరవిగ్రహము లును మిక్కిలి సుందరముగ నుండెను.

రాజసింహుని కాలమునాడు గట్టింపఁబడిన దేవళము లింకొక పద్ధతిని గలిగియుండెను. ఇందలి సింహవిగ్రహములు వేఱొక రీతిగానుండెను. తోరణ మొంటివరుసగనె యుండెను. సోమస్కంద విగ్రహమునకు ముందుఁ గొన్ని లింగములుంచఁ బడెను. కొండలనుండి తొలచి నిర్మింపఁబడిన గుహాలయములు మిక్కిలి యరుదుగ నుండెను. ఇవి యన్నియు ఱాలు చేర్చి కట్టబడినవియె. వీనియందలి పనితనమును మిక్కిలి యద్భుత ముగ నుండెను.

ప్రథమ నరసింహవర్మ మహారాజుచేఁ గట్టింపఁబడిన యైరావతేశ్వరాలయమను నదియొకటి కైలాసనాథాలయము మనునది మఱియొకటి కాంచీపురమునందు గలవు. పనామలై

యుండొక గుడియు మహాబలిపురమునందు షోరుకోవెల (shore temple) యనునది యింకొకటియుఁ గలదు. వీని పనితన మెల్ల మిక్కిలి చక్కగ నుండును.

ఐరావతేశ్వరాలయ మిండ్లనడుమను గా కేశ్వరాలయమున కెదుటఁ గలదు. ఇందనేక శాసనములును గలవు.

ప్రథమ పరమేశ్వరవర్మ తిరువాడివద్ద వీరధనేశ్వరాలయమును గాంచీపురమున వైకుంఠ పెరుమాళ్ల కోవెలను గట్టించెను.

ఇందలి శిల్పనైపుణ్యమును జూచి తీరవలసినదియె గాని వ్రాయుటకుమాత్రము సాధ్యము గాదు. నరసింహవర్మ పల్లవ మల్లుఁడు కాంచీపురమున మాతంగేశ్వరాలయమును ముక్తేశ్వరాలయమును గూడఁ గట్టించెను.

దంతివర్మ యెనిమిదవ శతాబ్దమునఁ గట్టించిన కూరము గ్రామ మందలి దేవళము మిక్కిలి విచిత్రశిల్ప కళానైపుణ్యముచే విరాజిల్లుచుండెను.

అపరాజితవర్మ కాలమునఁ గట్టింపఁబడిన యాలయములు ననేకవిధములగ నుండెను. ద్వారపాలురు చతుర్బాహువులఁ గలిగియుండిరి. పూర్వకాల పల్లవరాజులచేఁ గట్టింపఁ

బడిన దేవళములకును నపరాజితవర్మచేఁ గట్టింపఁబడిన దేవళములకును జాలభేదము గలదు. స్తంభములపై సింహవిగ్రహములు చెక్కింపఁబడి యుండలేదు. అపరాజితవర్మ కాలములోనె తిరుత్తానియందు వీరథనేశ్వరాలయ మొండు గట్టింపఁబడెను. ఇదియు మిక్కిలి యందముగ నుండును.

శివస్కందవర్మకాలము నాఁటి శిల్పకళ బౌద్ధ శిల్ప సాదృశ్యము గలిగి యాచారములందు హైందవ పద్ధతులఁ బోలి యుండె ననియుఁ బనితనము మాత్ర మైరోపీయ నైపుణ్యముతోఁ విరాజిల్లుచుండె ననియు నొక విదేశచరిత్రకారుఁడు వక్కాణించి యుండెను. మఱియు నితఁడు నాగరికప్రపంచమం దంతయు రోముయొక్క శిల్ప నైపుణ్యము వ్యాపించి యుండె ననియు హిందూదేశమందును ననేకవిధముల రోముదేశశిల్ప కళ విస్తరించె ననియు నుడివి యందలి మన హైందవశిల్పమున కచ్చెరు వంది తమ దేశ విద్యావిధానముతోఁ బోల్చికొనెను; కాని మన హైందవశిల్పకళానైపుణ్య మత్యద్భుత మైన దై విదేశీయులకును నివ్వెఱపాటు గలిగింపఁగలిగినది యై యుండె నని శ్లాఘింపఁ దగి యున్నది.

అమరావతి యందలి శ్వేతశిలాస్థూపవిధానమును నాగ్రాయందలి యశోకుని లోహస్తంభవిధానమును నెవ్వ నబ్బుర మొనఁగ కుండును!

బెజవాడకు సమీపమునఁ గల యుండవల్లిలోని గుహాలయ మెంతయు యద్భుతముగ నుండెను. ఇట్టి కాంచీపురమునందలి శిల్పచాతుర్యమును జూడ మిక్కిలి సుందరముగ నుండెను. ఇట్టి యద్భుతకళ నాచంద్రార్కము వెలయించి పల్లవరాజులు యశస్కాయు లైరి. ఈ విధముగ మహావైభవమున దేశపాలన మొనరించి విధివశముచేఁ జోళుల చేతను, పాండ్యుల చేతను జయింపఁబడి పల్లవరాజులు నామమాత్రావశిష్టు లై యందందు స్వల్పరాజ్యములను స్వతంత్రులుగనో, సమయము గానియప్పుడు సామంతులుగను యుండి దక్షిణదేశమున విదేశపరిపాలనారంభకాలమువఱకు నుండినట్లు పెక్కు గ్రంథనిదర్శనములు గలవు. కావునఁ జరమదశలోని పల్లవపరిపాలనమును గూర్చి రాఁబోవు ప్రకరణమున నించుక వివరించెద.



# చతుర్థ ప్రకరణము

—* చరమదశ *—

పాండ్య చోళ కేరళ ప్రభువులచేఁ దమ రాజ్యమును గోలుపోయిన పిమ్మటఁ గూడ నం దందుఁ గొందఱు పల్లవ ప్రముఖులు దేశపరిపాలనోద్యోగంబు నెఱపుచునే యుండి రని మన మిదివఱకె చదివియుంటిమిగదా? ఇట్టి చరమదశ యందలి పల్లవుల రాజ్యవ్యవస్థను గుఱించి కొందఱు విదేశచరిత్రకారులు చక్కఁగఁ దెలిపియున్నారు.

సింహళద్వీప మధ్యభాగమున కీశాన్యదిశను దిరుక్కణామలై (త్రికోణపర్వతము) యను బర్వతముయొక్క పార్శ్వమున నున్న యొకభాగమునకు వన్నిమండల మని పేరుగలదు. వహ్నికులస్థులచేఁ బరిపాలింపఁ బడినదగుటచే దీనికి పేరు వచ్చె ననుట స్పష్టము.

ఈ వన్నిమండల మెకప్పుడు స్వదేశరాజులైన 'వన్నియుల' చేతను, 'వన్నిచ్చి' లనుబిరుదునామము గల వన్ని

యరాజకాంతలచేతను బరిపాలింపఁబడు చుండెను. వీరు ప్రథమమున జాఫ్నా మలబారు రాజులకును వీరికిఁ బూర్వ ముండిన కాండీరాజులకును గప్పము గట్టుచుండినను గాలక్రమమున వీరికిఁ బిమ్మట రాజ్యపాలకు లైన వారికిమాత్ర మట్లు కప్పము గట్టక స్వతంత్రు లై చిరకాలము పాలించిరి.

మొట్టమొదట యూరోపియను లనఁబడు పోర్చుగీసువారు జాఫ్నాదేశమును బట్టుకొని స్వాధీన మొనరించుకొనిరి. వీరు (పోర్చుగీసువారు) వన్నియదేశమునకుఁ బేరునకు మాత్రము రాజులుగ నుండినను వీరి పరిపాలనము సముద్రప్రాంతమును దాటి నుతియెన్నడును విస్తరించి యుండ లేదు. వన్నియవీరు లెడతెగని పోరాటములచే విశ్రాంతి నెఱుంగకుండి నందున వీరిపై నెన్నడును దమయధికారమును నెలకొల్పి యుండలేదు.

ఈ పోర్చుగీసుల యనంతరమున డచ్చి వారును దమ యధికారమును స్థాపింప నెంచిరి; కాని సమరాభిముఖు లయ్యును గొన్ని సామజములను గప్పముగఁ గొనుటతో మాత్రమె తృప్తి నొందవలసిన వార లైరి.

కాని 1782 వ సంవత్సరమున డచ్చివారు ప్రబల ప్రయత్న మొనరించి వన్నియుల నన్నివైపులను నోడించి వారి దేశములను స్వాధీనపఱచుకొని నట్లు పరిణమింపఁ జేసిరి. ఈపో

రాటమున 'వన్నిచ్చి మెరియా సెంబత్తి' యను వన్నికుల రాణి మిక్కిలి ధైర్యసాహసములతోఁ బోరాడెను; కాని విదేశీయుల యాయుధవిధానముచేఁ దుదకు బంధీకృతురాలు గావలసి వచ్చెను. అయిన నీమె యీసంగరమునఁ బ్రదర్శించిన ధైర్యశౌర్యవిక్రమాదులు చరిత్రప్రసిద్ధంబులై యుండెను.

ఇట్లు డచ్చివారు దాము జయించిన రాజ్యముల యందుఁ దద్రక్షణార్థమై తూర్పు సముద్రతీరమునందు 'ములిటివో' యను బట్టణమున నొక బలిష్ఠమగుఁ గోటను గట్టిరి. కాని వన్నిదేశ మప్పటికె దైన్యస్థితిలో నుండి నిర్మానుష్యముగా నుండెను. కావున వీరి కీవిజయ మంతగాఁ బ్రయోజనకారి గాకపోయెను. అందలి జనులును నీ నూతనవిదేశీయప్రభుత్వమునకు సైపక వ్యవసాయాది వృత్తుల బరిత్యజించి భిల్లులను గలసి దారిదోపుడుగాం డ్రయి యాదీవి కిరుపార్శ్వములఁ గలసముద్ర తీర మందలి సేద్యభూములపైఁ బడి దోఁచుకొన సాఁగిరి. మఱియు మూనారు, ట్రింకోమలీ దేశవాసు లగు డచ్చి వారితో దోపిడియుద్ధము జరిగించుచుండిరి. జాఫ్నాద్వీపకల్పమునందుఁగూడ వీరు ప్రవేశించుటచే నచ్చటను గొన్ని కోటలఁ గట్టిరి. తరువాత సింహళము బ్రిటీషువారి పరిపాలనమునకు వచ్చిన పిమ్మటఁగూడ నీదేశస్థితి యిటులనె యుండెను.

'నివెరకులార్యా జిల్లాప్రాంతమునఁ బ్రముఖుఁడగు పండారవన్నియుఁ డనఁబడు కొండిరాజుతో 1808 వ సంవత్సరమున బ్రిటిషువారు దలపడినపుడు సంపూర్ణపరాజితులైరి. ఆరాజు ట్రింకోమలీ యఖాతసమీపమున నుండు కాట్టియారు' ను నాక్రమించుకొని ముల్లైద్వీపముయొక్క కోటయందలి రక్షకసైన్యమును వెడలఁగొట్టి యాకోటను బట్టుకొనెను. అప్పు డందలి బ్రిటిషు సేనానాయకుఁడును మఱికొందఱు సిపాయిలును నొక చేపలపడవలోఁ బడి తప్పించుకొని జాఫ్నాకుఁ బాఱిపోయిరి.

అప్పుడు వీరికి (వన్నియులకు) పదివిల్ చెఱువుచెంతనొక వరిచేలోఁ బాతుకొనియున్న కొన్ని యనుపయోగశతఘ్నులు దప్ప మ ఱేమియుఁ జిక్కలేదు. అయినను వీరి కీవిజయము స్థిరముగ దక్కక కొలఁదికాలములోనె తఱమఁగొట్టఁబడిరి. కోట లన్నియు మఱల స్వాధీనములు దప్పిపోయెను.

ఇట్లు క్రమక్రమముగ వన్నియుల ప్రతాపాగ్ని చల్లారఁదొడఁగెను. ఈ యెడతెగని పోరాటములచే వన్నిదేశము పాడువడెను. వ్యవసాయము క్షీణించెను. పశువులు దస్కరింపఁబడెను. చెఱువులు సంస్కారహీనములై బీడువడెను. ఇట్టి

విపత్తుల పాలై మిగిలిన వన్నియ ప్రజలు ఫలవంతములగు వన్ని దేశభూముల విడిచి వ్యవసాయాభిలాష గలిగి యుండినను సముద్రప్రాంత మందలి నిస్సారము లైన యిసుకపఱ్ఱులఁ జేరవలసిన వారైరి.

ఈ విధముగ దక్షిణహిందూస్థానమున ము న్నొకప్పుడు మహోన్నతదశ వహించి ప్రజాపాలన మొనరించిన వహ్నికుల (పల్లవ) సంతతివారు విధివశంబునఁ దొల్లింటి రాజ్యైశ్వర్యములఁ గోలుపోయి కుక్షింభరత్వమున కై యం దందు సంచరింపుచు గాలము పుచ్చవలసినవా రైరి.

ఈ వహ్నికుల క్షత్రియులు మిగుల శూరశిఖామణు లనుట కా ప్రాంతములవా రనేక గాథలఁ జెప్పుచుందురు. రివరెండు టెయిలర్ దొరవారు వ్రాసిన క్యాటలాగు రెయిసోమ్ (Catalogue Raisome) అను గ్రంథముయొక్క 3వ భాగము 427 వ పుటయందుఁ 'తిరువిడైచురము' కోటలో రాజ్యము చేసిన కాండవరాయన్, చేతురాయన్, అను నిరువురు వన్నియరాజుల గుఱించి వ్రాసి యుండిరి. అందు కాండవరాయన్, చేతురాయన్ అనువార లుత్తర దక్షిణములు 1,141 అడుగుల వెడల్పును, దూర్పు పడమరలు 1200 అడుగుల నిడుపును గల యొకకోటను గట్టిరి. దాని

ప్రాకారము 30 అడుగుల వైశాల్యము గలను. దానిచుట్టును గల యగడ్త 30 అడుగుల వెడల్పు గలిగియుండును. ఈ ప్రాకారము లోపల మఱియొక చిన్ని కోటయు నందలి యొక కొండ శిఖరమున నొక నగరును నుండెను. ఇట్లత్యున్నత ప్రతాపమున రాజ్యపాలన మొనరించుచుఁ దాము కప్పము గట్టుచున్న రాజుల ధిక్కరించి కప్పములఁ గట్టుట మాని మిగులఁ బ్రసిద్ధులైరి. వీరిలోఁ గాండవరాయఁడు మిగుల శూరుఁడై యుండ వీని పాలిగాఁ డొకఁడు వీనిపై దండెత్తివచ్చి గొప్ప యుద్ధమును జరిగించెను. ఈ యుద్ధమున వీని జయింపలేక మాయోపాయముచేఁ దన ప్రయత్నము నెఱవేర్చుకొనఁ దలంచి కాండవరాయుని యుంపుడుకత్తె యగు 'కుప్పాచీ' యను దాని సాహాయ్యమున వాని శిరచ్ఛేదము గావించెను. అంత నీ సంగతిని వీని సోదరుఁడైన చేతురాయున్ విని మిగుల క్రోధోద్రేకమానసుఁడై 'కుప్పాచీ' ని దీని చెలికత్తెల నూర్వురను నొక చెఱువుకడకుఁగొంపోయి యందు వారితలల నఱికి రక్తప్రవాహమును బ్రవహింపఁజేసి తన రోషానలంబును జల్లార్చుకొనెను. ఆ కారణముచే నీ చెఱువునకు "పీణమ్యేరి" (శవముల చెఱువు) అనునామము గలిగెను.

ఇటులఁ బౌరుషమే ప్రధానముగాఁ గల యీ వన్నియులు రాజ్యపరిపాలకులై ప్రకృతమున నుండి నట్లు పెక్కు

నిదర్శనములు గలవు. రామనాథపట్నము నందుఁ గనుంగొనఁ బడిన కొన్ని తామ్ర శిలాశాసనములందు వన్నియప్రభు వొక్కఁడు పదునెనిమిది దుర్గముల కధిపతియైనట్లును, మహమ్మదీయాక్రమణమునకు ముందు రామనాథపరిపాలకుఁడగు సేతుపతివలన జయింపఁబడినట్లును వ్రాయబడి యున్నది.

ఇట్లు దక్షిణహిందూస్థాన మంతయు వన్నియ లనఁబడు వగ్నికుల క్షత్రియులు పరిపాలించినట్లు చరిత్రల వలనను శాసనముల వలనను స్పష్ట మగుచున్నది.

అప్పుడు రాజ్యపాలకులుగ నుండినవారు బ్రిటిషు రాజ్యారంభమందును నున్నతదశయం దుండి కాలక్రమమున నేఁటికిని గొంద అందందు జమీాపాలకులుగ నుండి తమ పూర్వౌన్నత్యమును సూచించుచునే యుండిరి. ముఖ్యముగా దక్షిణదేశమునఁ దిరుచినాపల్లి, తిరునల్వేలి మండలములందు వగ్నికుల క్షత్రియ పాలితములైన కొన్ని జమీాలు గలవు. వానిలో "పయూాయరం పన్నై" జమీా "అలఘాపురి" జమీా "శివగిరి" జమీా యనునవి తిరునల్వేలి మండలమునందును, 'ఉదయాార్పాలియం' జమీా "అరియాలూరు" జమీా యనునవి తిరుచునాపల్లి మండలమునందును, చిదంబరము చెంతఁగల "పిచ్చవరం" జమీా యనునది దక్షిణార్కాడు మండలము

నందును, "మేల్పాకము" జమీా చెన్నపురి ప్రాంతమందును గలవు.

---

—: ఆ ధు ని కు లు . :—

---

ఆంధ్రదేశమున నగ్నికులక్షత్రియులైన జమీాందారులు లేకుండినను ధనధాన్యసంపత్తితోఁ దులఁదూఁగుచుండి కీర్తివిస్తారులైన కొన్ని కుటుంబములవారు గలరు. వారిలో—పొన్నమండ, పోతాబత్తుల, బత్ర్తె, కత్ర్తి, మల్లాడ మున్నగు గృహనామములుగలవారు కోరంగిలోను, తెలుకోటి, కోకిలగడ్డ, జల్ల, పినపోతు చెక్క, పొన్నాడమొదలగు గృహనామములుగలవారు తాళ్లరేవునందును; కోల, సీసు, అను నింటిపేర్లుగలవారు నీలపల్లిలోను; కామాడ, అనువారు యానాములోను; కొపనాతి, కొల్లు, రేవు, తాడిమనువారు బెండమూర్లంకలోను; పెదశింగు (పెసింగు), బలగముననువారు బందరునందును; చెన్నువారు విశాఖపట్టణమునందును మఱికొన్నితావులందు మఱి

కొందఱును విదేశ స్వదేశములతో నావికా వ్యాపార మొనర్చుచు నైశ్వర్యకాములై యుండిరి. వారిలోఁ గీర్తిశేషులగు మల్లాది సత్యలింగము నాయకరుగారెంతయుఁ బ్రశంసనీయులు. వీరు దమ స్వార్జిత మగు నిరువదిలక్షుల ధనములో నెనిమిదిలక్షుల రూప్యములను ధర్మకార్యములకై వినియోగింప మరణశాసనమును వ్రాసిరి. అందు—

(1) విదేశములకు నున్నత విద్యాభ్యాసమునకై వెళ్ళు విద్యార్థి కొకనికిఁ బ్రతివత్సరము వేతనము నిచ్చుట.

(2) బాలుర విద్యావిధానమునకును, జీవనోపాధికి ననువైన శిల్పకళల నేర్పుటకును నొక మాధ్యమిక పాఠశాల నిర్మాణ మొనర్చుట.

(3) దేవాలయ ప్రతిష్ఠాపనల రెంటి నొనర్చుట.

(4) ఇన్నూరు బీదసాదల కన్నదాన మొనర్చుట కవకాశము గల యొక ధర్మసత్ర మేర్పరచుట.

మున్నగు మహాకార్యము లొనర్ప శాసించి పరమపద మందెను. తద్ధర్మకర్త లీ మహాకార్యముల మిక్కిలి పరిశీలనాభావమున నెఱవేర్చియు నెఱవేర్చుచుచు నుండిరి.

గోదావరీ మండలమునం గల బెండమూర్లంక నివాసస్థులగు కొవనాతి కృష్ణమ్మగారు దివ్యక్షేత్రముగఁ బరిగణింపఁ బడుచున్న యంతర్వేది యందు విశేషధనవ్యయ మొనర్చి శ్రీలక్ష్మీనరసింహస్వామివారి యాలయమును గట్టించి విశేషవైభవముతో నేఁటికిని సాంవత్సరికోత్సవములు జరగున ట్లేర్పఱచి యుండిరి. ఈ యుత్సవమునకు జనులు తండోపతండములుగ వివిధప్రాంతముల నుండి పోయి స్వామిని సేవింపు చుందురు.

ఈ యాలయకర్త యయిన కృష్ణమ్మగారు మహాభక్తులై నట్లు వారినిగుఱించి యాప్రాంతములవా రనేక చిత్రగాథలఁ జెప్పుకొనుచుందురు. అందు నొకటి రెంటి నీక్రిందవివరించెదను.

(1) "కృష్ణానదీతీర మందలి యొక బ్రాహ్మణునకు మధ్యకాలమున నేత్రదృష్టి తొలఁగి యంధత్వము సంప్రాప్తంబయ్యెను. అప్పుడు మిక్కిలి విచారగ్రస్తుఁడై యుండ నొక నాఁటిరాత్రి స్వప్నమునం దాపాదుని యిష్టదైవము సాక్షాత్కరించి నీవు నాభక్తుఁడైన కృష్ణమ్మ యను నతఁడొక్కఁడు బెండమూర్లంకనివాసి గలఁడు. వాని యొద్ద కేగిన నీ యంధత్వంబు వాయగలదని చెప్పెను. అంత నావిప్రుఁడు బెండమూర్లంకకు వచ్చి విచారించి కృష్ణమ్మగారు కార్యాంతరములచేఁ దాళ్ళరేవు

నం దుండినట్లు తెలిసికొని యచ్చటి కేఁగి కృష్ణమ్మగారినిదర్శించి తనయుదంతమును స్వప్నవిధానమును నెఱింగింపఁ గృష్ణమ్మగారు భగవంతుని కారుణ్యమునకుఁ బరమానందభరితు లై అయ్యా! సమస్తసృష్టి చిత్రములకును భగవంతుఁ డాదికారణుఁ డయ్యు నా యా కార్యములను నాయా మానవాళిచేఁ జేయించి మనుష్యుల ద్వితీయకారణులుగ నొనర్చుచుండును. కావున మీ యంధత్వంబు వాపఁగలవాఁడు భగవంతుఁ డయ్యు నది నాచేఁ జేయింప నెంచెఁ గాఁబోలు! అని దైవధ్యానపరాయణుం డై తనచేత నున్న తడివస్త్రమును వాని కిచ్చి దీనిచే మీ కనులను దుడుచుకొనుఁడని చెప్పెను. ఆ బ్రాహ్మణుఁ డట్లొనర్ప వానికి వెంటనే చక్కని నేత్రదృష్టి గలుగ మిగుల సంతోషించి యట నుండి వీడ్కొనెను.

(౨) ఒక దినమున బెండమూర్లంక గ్రామమునకు 15 మైళ్ల దూరమునఁగల యంతర్వేది గ్రామ మందలి పెద్దలును జిన్నలును నవారిబోయల మ్రోఁత విని కృష్ణమ్మగారువచ్చుచున్నారని యెదురేఁగి నవారితోఁ గూడ శ్రీ నృసింహస్వామి వారి యాలయమువఱకును రాఁగా నా గుడితలుపులు వాని యంతట నవియే తెఱచుకొనెను. అంత నవారితోఁగూడ బోయలును గృష్ణమ్మగారును దేవాలయములోనికిఁ బ్రవేశించిన వెంటనే యాలయకవాటములు మఱల నవియే మూసి

కొనెను. అంతఁ బ్రక్క నున్న వా రిదియేమి యాశ్చర్యమా యని తలుపులఁ దెఱచుకొని లోనికి వెళ్ళి చూడఁగ నందు నెవ్వరును గనఁ బడరైరి. ఈ చిత్రమును గ్రామములో వింత వింతలుగఁ జెప్పికొనసాఁగిరి. నాఁటికిఁ బ్రొద్దుఁగ్రుంకెను. మఱు నాఁడు బెండమూర్లంకనుండి కృష్ణమ్మగారు గడచిన దినమునఁ బరమపద మందిరనువార్త వచ్చెను. అప్పుడు పౌరులెల్లరు కృష్ణమ్మగారు నృసింహస్వామివారిలో నైక్యమైరని తెలిసికొని మిక్కిలి భక్తిశ్రద్ధలఁ జూపిరి.

ఇట్టి కథ లనేకములు సెప్పుదురు. ఇందలి సత్యాసత్యము లెట్లున్నను గృష్ణమ్మగా రత్యంతభక్తాగ్రేసరు లని యిప్పటికిని నాప్రాంతముల వారు విశ్వసించుచుందురు.

వాడపల్లిలోఁ గల శ్రీవేంకటేశ్వరాలయము తాళ్లరేవువాస్తవ్యులయిన పినపోతు గజేంద్రుడుగారిచేఁ గట్టింపఁబడినది. ఇందును బ్రతివత్సరము మిక్కిలి గొప్పయుత్సవములు గావింపఁబడు చుండును.

నీలపల్లి నివాసు లగు కర్రి కూరేశులుగా రమితధనాఢ్యులును భక్తితత్పరులును నై మూఁడు సారులు సువర్ణతులాభారములఁ దూఁగి మూఁడుదోసిళ్ళ వరాలను ఆయవరము దేవాలయమున కొసఁగి నట్లు చెప్పుదురు.

బందరు నందుఁ గల రావుసాహెబు ప్రెశింగు (పెద శింగు) వెంకట రంగయ్యగారి తండ్రి యగు స్వామి యనువారు ముప్పది రెండు దేవళములలో ధ్వజస్తంభప్రతిష్ఠాపనములను జరిగించి మిక్కిలి భక్తితో నుత్సవాదుల జరిగించి యుండిరి.

మదరాసులోని తిరువలిక్కేణి (Triplicane) యందుఁ గల శ్రీపార్థసారథిస్వామి కోవెల మిక్కిలి గొప్పదియై పేరెన్నికగాంచి యుండెను. ఈ యాలయ నిర్మాత పల్లవప్రముఖుఁడై యుండెను. అందుచే నా స్వామివారికిఁ బ్రతివత్సరము నొకదినమున నగ్నికులు లొక గొప్ప యుత్సవమును జేయించెదరు. ఈ యుత్సవము మదరాసులోని కోమలేశ్వరము పేటలోఁ గల కులశేఖరము పెరుమాళ్లు సభవారి యాజమాన్యమున జరుపఁబడు చుండును.

అట్లె చింతాద్రిపేటలోఁ గల యాదికేశవ పెరుమాళ్ళ యుత్సవమునుగూడ నీకులజులచేతనే జరిగింపఁబడు చుండును. మైలాపూరులోని కపాలేశ్వరస్వామివారి యాలయ మందు ప్రథమహారతి నిచ్చు నధికారము తమకే (అగ్నికులక్షత్రియులకు) గలదని హైకోర్టువారి తీర్మానము స్థిరపఱుచు చున్నది. ఈ యాలయమును బల్లవులె కట్టించి యుండిరి. చిదంబరములోని కోవెలయు హిరణ్యవర్మచేఁ గట్టింపఁబడినట్లు శాసనములు

గలవు. మయూరిలోని వైదీశ్వరస్వామివారి యాలయమును పల్లవరాజనిర్మిత మైయున్నది.

మఱియుఁ జెన్నపురిలోని శాంథోము (St. Thome)ను కందప్పరాజను పల్లవుఁడు పాలించుచుండ దత్కాలమున నందుఁ బ్రవేశించిన క్రైస్తవ మిషనరీల బోధల కుప్పొంగి తానును దనతో మఱికొందఱును క్రైస్తవులైనట్లు తెలియుచున్నది. ఈ కందప్పరాజు భక్తిపారవశ్యత గలవాఁడై యన్య బోధలకుఁ జెవియొగ్గియుండెననియెదను.

ఇట్లు వైరాగ్యభక్తులును గౌరవాసక్తియుఁ గలిగి నడచుకొను చుండును. జాతీయుగాక సంఘాభివృద్ధికి దేశాభ్యుదయమునకుఁ బాటుపడుచుండువారును గలరనుట కొకటి రెండు విషయ ములమాత్రము వివరించెద:—

1888 వ సంవత్సరమున నేర్పడిన వహ్నికులక్షత్రియ సంఘము వారిచే మదరాసునందు మూఁడును, కంచి, మధు రాంతకము, తిరుకాళి, కండరము, కుమాలము— అనుపట్టణ ములనాలుగును విద్యాలయములు నెలకొల్పఁబడెను. చెన్న పురిలోఁ బచ్చయప్పకాలేజికి సంబంధించియున్న చెంగల్వానాయ కరు "టెక్నికల్ స్కూలు" నెలకొల్పఁబడియెను. ఈ మహాశ యునిచే నొక యనాథశరణాలయముగూడఁ బోషింపఁబడు

చుండెను. గోవిందప్పనాయకర్ స్కూలను నదియు లోవరు సెకండరీ వఱకుఁగలిగి యీకులజాల కీర్తి చిహ్నమై యున్నది.

స్వసంఘాభిమానముగలిగి సంఘపుఁకోవృద్ధికి బాటుబడుచు సాంఘికుల యొక్కయు దేశపాలకులయొక్కయు గౌరవోన్నతుల కర్హులైనవారు పెక్కండ్రు గలరు. వారిలోఁ బ్రస్తుతమున్న బాదగువాస్తవ్యులు శ్రీయుత్ పెశింగు వెంకటరంగయ్యగారు ప్రథమగణ్యులై యుండిరి. వీరు బాల్యమునుండియు మిగుల ధైర్య స్థైర్యములు గలవారై తమ 20 వ యేటఁ దమతండ్రిగారి నావలలో నావికోద్యోగమునఁ బనిసేయుచు నెనిమిది సంవత్సరములవఱకు సముద్రతీరపట్టణము లన్నిటికి బోయియుండిరి. ఈ కాలములో సముద్రవ్యాపారమును వర్తకరహస్యమును బాగుగా గ్రహించినవాఁడగుటచే మచిలీపట్నమునందు వర్తకము నొనరింపఁ బ్రారంభించెను. వీరి జనకుని యొక్కయు సోదరుని యొక్కయు మరణానంతరమున నెల్లవిషయములకు దానే స్వతంత్రుఁడై విరివిగ వర్తక మారంభింపసాగెను. ముఖ్యముగా వీ రనేకవ్యాపారములను వృద్ధికి దెచ్చిరి. ఒకదాని తరువాత నొకటిగాఁ బది యోడలఁగట్టించి వర్తకమును విరివిఁజేయఁ దొడంగిరి. ఇప్పటికి కోరమాండలు తీరమునఁ గల నౌకాధికారులలో వీరే యధిక నౌకలు గల గొప్పవర్తకశిఖామణు లని యెన్నఁడగి యున్నది.

వీరన్న వీరి సంఘమునం దెక్కువ గౌరవముగలదు. వీరు తమ సాంఘికులుగల సమీపగ్రామములందు పంచాయతికోర్టుల నిలిపి తమవారి వివాదవిషయముల నెల్ల తామె యుక్తాయుక్తముగఁ బరిష్కరింపుచుందురు. 1918వ సంవత్సరమున బందరులో జరిగిన యగ్నికులక్షత్రియమహాజనసభ యందీయన సంఘాధ్యక్షులుగ నెన్నుకొనఁబడెను. ఆ సందర్భమునందము బాలురకొక వసతిగృహమును (Hostel) పదివేల రూప్యములు వెచ్చించి కట్టింప వాగ్దాన మొనరించి యట్లే కావించుచుండిరి. అందు సంఘబాలురకుచితభోజనాదిసౌకర్యములొసఁగఁబడుచుండును.

ఈ వసతిగృహమున నాయుర్వేదశాస్త్రానుసారముగ నౌషధముల సిద్ధము జేయించి, యొక భిషగ్వరు నందుంచి పెక్కండ్ర కుచితముగ నౌషధము లిచ్చున ట్లేర్పాటు గావించిరి. ఈ విధానము కొంత కాలమువఱకు జరిగినది. కాని తత్సమీపముననే యాంగ్లేయౌషధశాల (Hospital) యుండుటచే నీ యాయుర్వేదౌషధశాలకు వచ్చు వా రరుదగుచుండుటచేఁ బ్రస్తుత మిది నిలిపివేయఁబడెను.

ఒకప్పుడనఁగా 1918 సం॥ లో దుర్భిక్షము సంప్రాప్తమయి పేదసాదలు జీవింప నాధారము గనఁజాలక క్షుద్బాధచేఁ బ్రాణములు వోవుచున్న తఱిని బందరు చుట్టుపట్ల గ్రామ

ములందుఁగల కొందఱు నిఱుపేదలు ప్రాణములకుఁ దెగించి బియ్యపుకొట్లను దోపిడి చేయసాఁగిరి. వీరు కేవల మన్నాపన్నులయి లావించుచుండిన వారగుటచే నట్టి వారికి రెండు దినములు తమ సొంత బియ్యపు బస్తాలను తెప్పించి విరివిగఁ బంచిపెట్టించిరి. పిమ్మటఁగూడఁ గొన్నాళ్ళ వఱకు బజారు వెలకంటె మిక్కిలి తక్కువ వెలకు నిచ్చుచు బీదల కృతజ్ఞతకుఁ బాత్రులయిరి.

వీరు జర్మనుల సంగ్రామకాల మైన 1917 వ సంవత్సరమున నాయా సందర్భములయందు విరివిగ బీదల కన్నప్రదానము లను గావించి యుండిరి. ఇంకను మఱికొన్ని కారణములచే సంతృప్తినొంది దొరతనమువారు శ్రీ గుత్తప్రెనింగ వెంకట రంగయ్యగారికి 1920 వ సం॥ జనవరి 1 వ తేదీని, “రావుసాహెబ్” బిరుద మొసంగి గౌరవించిరి.

అంతియగాక బందరు నందలి మునిసిపల్ కౌన్సిలు సభ్యులుగను, బెంచిమేజస్ట్రీటుగను నెన్నుకొనఁబడిరి. మఱియు పబ్లిసిటీబీరోయందు గౌరవ సభ్యులుగను మదరాసు శాసన సభాసభ్యులుగను నెన్నుకొనఁ బడిరి.

వీరిలో రాజకీయోద్యోగమునందును ఘనతర పదవుల నలంకరించినవారు కొందఱు గలరు. గొప్ప యింజనీయరు

పదవియం దుండి బెజవాడ చెంతఁ గృష్ణానది కానకట్ట గట్టించిన బరంపుర వాస్తవ్యులు కీర్తిశేషు లగు దివాన్ బహదరు వాతాడ వెంకటరెడ్డి నాయుఁడుగారును, రాజమహేంద్రవరమున డిస్ట్రిక్టు జర్జునుగఁ బనిచేసిన కీర్తిశేషులును, బర్లాకిమిడి వాసులును నగు కొప్పాడి జగ్గారావు నాయుడుగారును నగ్నికుల క్షత్రియవంశోద్భూతులే. మదరాసునందు న్యాయవాద వృత్తియందున్న వారును మఱికొన్ని యున్నతోద్యోగములందున్న ప్రముఖులును గలరు.

ఇఁక నీచరిత్ర ముగియుచున్నది. సృష్టియందు నొకప్పుడు మహోన్నత దశ నందిన యొక వ్యక్తి కాలక్రమముచే మఱి కొంతకాలమున కధఃపతితమై యూరును బేరును లేకుండ నదృశ్య మగుటఁ జరిత్రలవలనఁ దెలిసికొనుచుంటిమి గదా! భూగతమై యంతరించిన సామ్రాజ్యములు చరిత్ర పరిశోధకులకు గోచరించుచునే యున్నవి.

యవనపండితుఁ డగు యరిస్టాటిల్ జీవరాసులకుం బోలె జాతులకును బాల్య యౌవన వృద్ధ మరణావస్థలు గలవని విశదీకరించి యుండెను. జాతియుఁ దొలుత బాల్యదశయం దుండి క్రమక్రమమున విజృంభించి కీర్తిసంపద లంద మఱి కొంతకాలమునకు శిథిల మయి విస్మృత నామమాత్రావశిష్ట